శ్రీ

# చంద్రమతీ పరిణయము.

ఐదంకముల నాటకము

ఇది

సత్తెనపల్లి తాలూకా, ఉప్పలపాటి వాస్తవ్యుడగు

బాలకవి

## నరికొండ హనుమంతరాజుచే

రచియింపబడి


నరసరావుపేట

లక్ష్మీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి, ప్రకటింపబడియె.

మొదటికూర్పు 500 ప్రతులు

1936





వెల 0—12—0

శ్రీరస్తు.

# పండితాభిప్రాయములు.

బ్రహ్మశ్రీ ఇనుమెళ్ల రామకోటేశ్వర శర్మగారి దివ్యచరణార విందసన్నిధానమునకు నమస్క్రియా పురస్సర విజ్ఞాపన.

మహాశయా! తమకుశిష్యుఁడను, గుచేలాయుష్మంతుడును నగు చి॥ సరికొండ హనుమంతరాజకవిచే రచింపబడిన చంద్రమతీపరిణయమున మూడంకములుమాత్రము కవి ప్రేరణమున స్థాలీపులాకన్యాయముగ దిలకించినాడను. కవిత్వము గీ॥ గోస్తనీపాక పాక ముగుస్తరించి, మధు మధుర సంపదంతుర ప్రహరించి, యనునటుల నలరారుచున్నయది ప్రథమపత్రమున గ్రంథకర్త పీఠికయను పేరుతో, "నీనాటకమునందలి లోపములసవరించిన బ్ర॥ వే॥ పమిడి శేషశాస్త్రీ గారికి నావందన శతంబులర్పించుచున్నాడను" అనివ్రాసిన దానిన్ బట్టి కవితావిషయమునగాని, వ్యాకరణవిషయమునగాని, ఇంక నేవిషయము గన్ గాని, నేనంతగా ప్రసక్తి తీసికొనుటకు వకాశము కలిగినదికాదు. వస్తుతస్తు కవి, సరసహృదయుఁడును, నిరాడంబరుఁడును, పసివాడును, నగుటచే దనకవితయు నిరాడంబర సరసప్రధానముల వన్నెగాంచియున్నయదియని చెప్పుచు, కొన్నిపద్యముల నుదాహరణముగ నిట బొందుపరచుచున్నాడను. 1వ అం. మ॥ ఘనరాసుల్. ఉ॥ తొల్లిటి. 2వ అం. సీ॥ పవలు. 3వ అం. ఉ॥ పన్నగ. సీ॥ ఈకల్కిపల్కుల. సీ॥ సంపూర్ణ. చ॥ వనమున. గీ॥ కల్కిగాదిది. ఉ॥ చూడగ. చ॥ వెడలు. ఉ॥ నీనగుమోము. ఉ॥ కాంతుకటారి. గీ॥ సర్వమును. అనుపద్యములయందలిసొంపు, భావసందర్భము, ముద్దులమూటగట్టుచుండుటచే నొకనిమేషమేని పుస్తకమును జేతినుండి దీయ మనస్సాక్షియొప్పికొనకున్నయది. ఇంతయేల 3వ అం. రాగములపేర్ల శీర్షముల నలంకరించివ్రాసిన సీసపద్యరత్న మెంతవిలువ చేయునో అందులకు కవులే స్వతంత్రులనుటలో నావంతయేని గర్వోక్తి కానేరదు. ఇంత మాత్రమున తమశిష్యు డపారపాండితీ ధురంధరుండనిగాని, అపర తిక్కనామాత్యుడని గాని, సంబోధించి యందలిగల భావగర్భితార్థములమూలమున గించిజ్ఞుడను నర్థమువచ్చునటుల నిమిడ్చితినేమోయని తాము శంకింపకుడు. కవియొనర్చిన కష్టమునుగూర్చి యథామాత్రమైన బ్రోత్సహింపనిచో శ్లో॥ నిరాశ్రయానశోభంతే పండితా, వనితా, లతా. య

నున్యాయమున నికదిక్కెవరు? కవితనమార్గమును మరల్చుకొనునేమో! ఆమూలమున మనకు లభించు పురుషార్థమెయ్యది! పరశ్రేయో సహనాభావముదక్క మరేద్ది! శాతం పాపం అంతకంబెదోషము లదాయని యోచించి, నాయదార్థ భావమును వెల్లడించినాడ. గ్రంథకర్తయు నితోధిక వృద్ధిగా గ్రంథ రచనకున్ గడంగుచుండుగాత. అస్మాదృశత్వా దృశా మోఘాశీస్సులు సదా గ్రంథకర్తకున్ జిరాయురున్నతులుగలిగించుచుండుగాత.

శారదా నివాసమ్. ముప్పాళ్ళ } ఇత్థం గోపాలుని హనుమంత రాయశాస్త్రి.

సుధీమహిమాంచిత మహా గుణభూమణులారా? ఆంధ్ర సోదర సోదరీమణులారా?

శ్రీ చంద్రమతీ పరిణయంబను నాటకంబును రచించిన యీ కవి సత్తెనపల్లి సీమాంతర్గత ఉప్పలపాటి వాస్తవ్యుడు. భట్రాజు కులీనుడు. సరికొండ రామరాజు తిరుపతాంబగార్ల గర్భ సంభూతుడు. హనుమంతరాజ నామధేయుడు. మరియు మాకు శిష్యుడు.

తొలుదొల్త నీకవి శ్రీరామస్తవము, గురుభక్తి, సీతాకల్యాణము, మొదలగు గ్రంథముల రచించి, మన యాంధ్రలోకమున కర్పించి కృతార్థతవహించిన ధన్యుడు. మ॥ సుతు సవ్యక్తపుమాట తండ్రికొదవించున్ గాదె యానందమున్. అను నార్యోక్తి రీతి మాశిష్యుడెట్టి పద్యంబు లల్లినను, యెట్టి నాటకంబులు రచించినను, మా కానంద దాయకంబనుమాట లోకవిదితమేయనియు, మేమీ నాటకంబునందున్న లోపాలోపంబులు సవరించుటంత ముఖ్యముగాదనియు, మాగ్రామవాస్తవ్యులును, సంస్కృతాంధ్ర విద్యావిశారదులునగు బ్ర॥వే॥ పమిడి శేషశాస్త్రిగారివలన నీ నాటకలోపంబులను సవరించుకొనులాగున జేసితిమి. మరియు నాంధ్ర గీర్వాణ హూణ భాషా ప్రవీణులును సంగీత విద్యావిశారదులును, రాగ తాళ మాల తరంగిణ్యాద్యనేక ప్రబంధరచయితులును, ప్రశస్త నాటక రచనాలంకృతులును, నగు బ్ర॥వే॥ గోపాలుని హనుమంతరాయ శాస్త్రిగా రొకనాడ తాత్తుగా మా గ్రామమునకు దయచేసినపుడు వారికీ నాటకమును జూపించగ మూడంకములను మాత్రము దిలకించి, నిజమైన యభిప్రాయ మొసంగిరి. పతివ్రతా శిరోమణియని ప్రఖ్యాతిగాంచిన, యీ నాటక కథానాయికయే సత్యహరి

శ్చంద్రసార్వభౌముని యిల్లాలు. ఈమె భర్తతోపాటు పలుకష్టము లనుభవించి, ప్రఖ్యాతివహించిన మహాయిల్లాలని సత్యహరిశ్చంద్రీయమునుగాంచిన ప్రతిమానవునకును దెలిసియే యున్నది. గాని యీసుగుణవతి జననంబాదిగా పరిణయంబువరకు జరుగ బడిన చరిత్ర ప్రతిమానవునకు దెలియదను నమ్మకముతో యీకవి యీచంద్రమతీ పరిణయంబును నాటకరూపంబున వ్రాసెను. ఈ నాటకంబును చదువరులు జదివి, నాటకులు ప్రదర్శించి, యిందలి సారాంశమును గ్రహించి, కవికి మరొక నవీన నాటకము వ్రాయులాగున నుత్సాహము గలిగించుదురనుచును, సర్వేశ్వరుండీ కవికి నిరంతరాయురారోగ్యైశ్వర్య ధన కనక వస్తువాహనాంబరాదులొసంగి రక్షించుగాతయని ప్రార్థించుచు నింతటితో గలము నాపుచున్నారము.

ఇనుమెళ్ల, వినుకొండతాలూకా }

ఇట్లు విధేయులు,
**ఇనుమెళ్ల రామరాఘవులు.**

## ఆర్య సోదర సోదరీమణులారా ?

మ.రా.రా.శ్రీ నరికొండ హనుమంతరాజ కవిచే రచియింపబడిన యీ చంద్రమతీపరిణయము నామూలాగ్రము జదివిచూచితిని. హృద్యములైన పద్యములతోను, ముద్దులుగులుకు మాటలతోను, నిండియున్న యీపాత్రము సర్వజనుల కానందము గొల్పకమానదు. ఈలాటి చిరుత వయసునందే యీ బాలకవిగారిట్టి గ్రంథరచనకున్ గడంగుట కెంతయో సంతసించితిని. ప్రస్తుతశైలిన్ బట్టిచూడ వీరి కవిత్వమిక ముందు ముందు మిగుల వృద్ధిలోనికి రాగలదని నా నమ్మకము. గ్రంథకర్తగారు మాకు మిత్రమండలిలోని వారగుటవలన విశేషించి వ్రాయుట లోకసమ్మతముగాదని తలంచి యింతటితో విరమించుచున్నాడను.

ఉప్పలపాడు, సత్తెనపల్లి తాలూకా }

ఇట్లు బుధజనవిధేయుడు,
**మద్దు పద్మనాభయ్య శ్రేష్ఠి.**



# పీఠిక

భారతి సోదర సోదరీమణులారా ?

నేనొక దినంబున రాత్రి వేళ భోజనానంతరము దల్ప[redacted] యేదేని యొక గాధను నాటకరూపంబున వ్రాయవలయునని తలంచుచు గొంతసేపటికి నిద్రాదేవతచే నావహింపబడితిని.

మరునాడుదయమున నా ప్రియమిత్రులగు సుంకర బ్రహ్మయాచారి, గోనుగుంట్ల పెదబ్రహ్మయ్యగార్లు నాకడ కరుదెంచి బ్ర॥ వే॥ దోర్బల్ల కొట్లింగంగారు రచించిన నిత్యసత్యవ్రత చరిత్రయను వచన కావ్యము నొక దానిని జూపి, దీనిని నాటక రూపమున రచించుమని నన్ను ప్రోత్సాహపరచి నాకా గ్రంధము నొసంగిరి. స్నేహిత వాత్సల్యముచే వారి యభిలాష నెరవేర్పవలయునను కుతూహలము నా హృదయమున జనించి, యా వచనకావ్యము నాధారపరచుకొని, చంద్రమతీపరిణయమను పేర నీపొత్తమును వ్రాయ నారంభించి, సాధ్యమైనంతత్వరలో ముగించి, మన భారతదేశమున కర్పింపగల్గితిని. కాని అమరవ్యాకరణాది గ్రంధముల జూడక పోపుట చేతను, ఛందోలక్షణము సరిగా నెరుంగని వాడనగుట చేతను, యీ నాటకమునం దనేక లోపంబులుండినయుండవచ్చును. ప్రస్తుతకాలమందుండు కవులు, పండితు, లోపంబుల మన్నించి, మరొక గ్రంథము వ్రాయుటకు నన్ను ప్రోత్సాహపఱచెదరని ప్రార్థన. ఈ నాటకంబునందలి లోపంబులు సవరించిన బ్ర॥ వే॥ పమిడి శేషశాస్త్రిగారికి నావందనశతంబు లర్పించుచున్నాడను

ఉప్పలపాడు
సత్తెనపల్లితాలూకా }

ఇట్లు విన్నవించువిధేయుడు,
బాలకవి సరికొండ హనుమంతరాజు
గ్రంధకర్త.

# ఇందలి పాత్రములు.

## పురుషులు.

జయసేనమహారాజు

సుబుద్ధి

శివుడు

వెంకట్రామశాస్త్రులు } బ్రాహ్మణులు

మర్కటావధానులు } బ్రాహ్మణులు

వశిష్ఠుడు

అత్రిమహాముని

పింగళుడు

మయబ్రహ్మ

దామోదరుడు } శిష్యులు

గుణనిధి } శిష్యులు

పురుషోత్తముడు } శిష్యులు

త్రిశంకుడు

హరిశ్చంద్రుడు

సత్యకీర్తి

భటులు

## స్త్రీలు.

శుకవాణి

చంద్రమతి

పుష్పవేణి



# శ్రీ
# చంద్రమతీ పరిణయము.



నాంది.

శా॥ శ్రీరంజిల్లెడు దేవదేవుడు, విరించిస్తుత్యు, డంభోధిగం
భీరుం డద్రి సమానధైర్యు డలగోవిందుండు, విష్ణుండు, శ్యాం
గారాకారుడు, శత్రుభంజనుడు, సత్కారుణ్య సంధాను డిం
పారన్ సభ్యుల బ్రోచుగావుత కృపావ్యాసంగియై భూస్థలిన్॥

(సూత్రధారుడు ప్రవేశించుచున్నాడు)

సూత్ర— ఆహాహా ? ఏమి యీ సభాభవన వైభవము. సకల కళా
ధురంధరులగు పిన్నపెద్దలు తండోపతండంబులుగా నేతెంచి,
మందమలయానిలము వీచుచుండ, సుందరవదనారవిందులై
వారిలో వారేదియో మందలించుకొనుచున్నవారలే (తెరవంక
జూచి) నాప్రియురాలింతవరకును రాదయ్యె. కారణమేమో
తెలియదు. ఐన నొకసారి పెద్దగా బిలిచి చూచెద. ప్రేయసీ,
ప్రేయసీ.

నటి— (ప్రవేశించి) మనోహరా ? మీ సేవకురాలి కేమియాజ్ఞ

సూత్ర— ఏమియాజ్ఞయని యడుగుచుంటివా. చూచితివా సభికుల
యానందము ?

నటి— ఎందులకు

సూత్ర— ఓసి నిర్భాగ్యురాలా, యింత మాత్రము గ్రహించలేక
పోయితివా.

నటి— నాథా ! నే గ్రహించితినిగాని, నామందమతియను నాలు
గక్షరములే గ్రహించలేకపోయినవి.

సూత్ర—ఈసభ్యులునాటకప్రదర్శనమునకై వేచియుండిరనితలంచుము

నటి— అటులైన ప్రదర్శింపబోవు నాటకమెయ్యది

సూత్ర— చెప్పెద వినుము

చ॥ పరమ పతివ్రతామణియు, భర్తృ పదాంబుజసేవ చిత్త సం
భరితయు, సద్గుణాన్వితయు, భవ్యులు సన్నుతిజేయజాలు స
చ్చరితయునై విరాజిలెడు చంద్రమతీ సతి పెండ్లి గాధ యి
ప్పుర జనులెల్ల సంతసిలబోటిరో యిష్టు బ్రిదర్శనీయమా

నటి— ఆహా! పతివ్రతా శిరోమణియని వాసికెక్కిన చంద్రమతీపరి
ణయమా. అట్లయిన నేడెంత పుణ్యదినము. మనోహరా?
తెలిసినదిగాని యింకొక సందేహము మాత్రము మదియందు
జిక్కొని మాటిమాటికి పీడించుచున్నది

సూత్ర— ఏమా సందేహము ?

నటి— ఇట్టి పుణ్యగాధను రచించినకవి నెరుంగుటకై తీవరించుచుంటిని
నాయం దనుగ్రహముంచి సెలవిండు

సూత్ర— గ్రంథకర్తనే యెరుంగవా

నటి— ఎరిగిన విన్నడుగ నవసరమేమి

సూత్ర— సరే వినుము

చ॥ కవిజనసేవకుండు, గుణగణ్యుడు, (శ్రీ) సరికొండవంశ సం
భవు, డలవాయునందనుని పాదసరోజముల న్భజించు, భ
క్తవరుడు, బాలసూరి యనగన్ దనరా "హనుమంతరాజు" సం
స్తవ తమమైన యీచరిత తా విరచించెను నాటకంబుగన్

సంశయంబు దీరినదా

నటి— చిత్తము

సూత్ర— (వినుట నభినయించి) అదిగో కాంపిల్య నగరంబు పరిపా
లించు జయసేన మహారాజు తన మంత్రితో ముచ్చటించుచు
నిటే వచ్చుచున్నాడు. ఇక నిచట నుండగూడదు. మనమరిగి
పైపనులు సవరించుదము పద

నటి— చిత్తము (నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన





శ్రీ

# చంద్రమతీపరిణయము.

## ప్రథమాంకము.



రంగము:— కాంపిల్యనగరము

[జయసేనమహారాజు; సుబుద్ధి ప్రవేశించుచున్నారు]

జయ:— అమాత్యోత్తమా ?

సీ॥ కడునిష్ఠతోడనే కంజాక్షునింగూర్చి
తపమాచరించితి తనివిదీర
నాసతీమణులతో నాపురజనులతో
గలశియజ్ఞంబులు సలిపినాడ
మోదంబుమీరనే గోదానభూదాన
ములనొసంగి భూసురులకులెస్స
నేకాదశీవ్రతంబెల్లప్డు జేసితి
తీర్థయాత్రలకునై తిరిగియుంటి॥

గీ॥ గానియొక్కసుపుత్రునిగాననైతి
దలపనేజేసినట్టి పాతకమదేమొ
తెలియకున్నది కటకటా దీనికెంతొ
చింతసేయుచునుంటినో శిష్టచరిత॥

ఔరా? నేజేసిన పుణ్యకార్యములన్నియు నడవికిగాచిన వెన్నెలవిధంబయ్యెనుగదా ఎన్నియశ్వమేధాది యాగంబు లాచరించినను, ఎందరు కాంతామణులుండినను, యెన్నియో మితిలేని ధనరాసులుండినను, ధరణీచక్రంబెల్ల నొక్కండనై పరిపాలించుచుండినను, దేవేంద్రాదిభోగంబు లనుభవించుచుండినను "అపుత్రస్య గతిర్నాస్తి" యనునట్లుసుతులు లేనివారికి గతులులేక దుర్గతుల పాలగుదురుగదా ఇకనాజన్మముకడ తేసుటెట్లు ?

సుబుద్ధి— ఔనురాజేంద్రా? నీపల్కులు సత్యములు

జయ— [కొంతవడి వాలోచించి] సుబుద్ధీ

మ॥ భయశార్దూల మృగంబులుండు వనికిన్ భార్యాసమేతంబుగా
పయనంబై చని యందునిశ్చలమతిన్ ఫాలాక్షునింగూర్చినే
బ్రియమారన్ దపమాచరించవలె మంత్రీ?సేవకున్బంపిను
త్ప్రియకాంతామణి నిందువచ్చునటులన్ బిల్పించుమా వేగమే।

సుబు— చిత్తము ఎవరక్కడ

సేవ— అయ్యా యేమిశెలవు

సుబు— భూకాంతునాజ్ఞదెల్పి శుకవాణీదేవిగారినిదోడ్కొనిరమ్ము

సేవ— చిత్తము [నిష్క్రమించుచున్నాడు]

సుబు— భూపాలా శుకవాణికొరకు దూతనుబంపితిని

[ పిమ్మట శుకవాణి ప్రవేశించుచున్నది ]

శుక— ప్రాణప్రియా నమస్కారము

జయ— "దీర్ఘసుమంగళీభవ"

శుక— నాథా నన్నింతత్వరలో మీసన్నిధానమునకు బిల్పించినకారణ మేమియో సెలవీయ బ్రార్థించెద

జయ— చెప్పెదవినుము

మ॥ ధనరాసుల్ మితిలేక యుండినను మిత్రశ్రేణియుంజాలగ
గ్గిన కాంతామణు లెందరుండినను సత్కీర్తి ప్రభామూర్తులౌ
తనయుల్ గల్గనివాని జన్మమణుమాత్రంబేని లాభంబులే
దని వేదంబులు బల్కుచున్న విగదా యజ్ఞాతప త్రేక్షణా॥

పరమేశ్వరుండు సకలసౌఖ్యంబులును సర్వభోగంబులును కొదువ లేకనొసంగి నాడుగాని యొక్కకుమారుని మాత్రము బ్రసాదించడాయె గదా ఇంకమనజన్మలు తరించుటెట్లు మనము స్వర్గార్హులమగుటెట్లు॥

శుక — ఏవనుమనము జేయునదేమున్నది ఈరీతి సంతానహీనులై చింతిలుడని మనఫాలభాగము లందులిఖించిన యాబ్రహ్మననుకొనవలయును

జయ— దేవీ అట్లుగాదు నేనందులకొక సాధనము వెదకితిని

శుక— అదెట్లు

జయ— శరభ, భల్లూక, వేదండ, వరాహ, ఖడ్గ, వ్యాఘ్రాదిమృగరాజంబులు సంచరించు భయాకరాటవులన్ జేరి, యందు మనమిద్దరము నారవస్త్రధారులమై యాపశుపతిన్ గూర్చి మితిలేని తపమాచరించిన సుతుల నివ్వడా యని నిశ్చయించుకొంటి, నిదేనాకోరిక

శుక— నాథా మన మాఘోరాటవుల కేగనేల అందునారవస్త్రములు దాల్చి తపంబాచరించనేల పరాత్పరుండైన పార్వతీనాథుడొక చోట నుండి యొకచోటలేడా

ఉ॥ అంబుధులందు పర్వతములందు భయంకరమైన యాయర
ణ్యంబులయందు పత్తనములందు తపంబులయందు నశ్వమే
ధంబులయందెగాక వసుధాస్థలిసంతతనిండి శూలి మో
దంబు జెలంగ సాధుల సతంబును బ్రోచును గాదె యొక్కడై॥

సూదిమొన మోపసందులేక నిండి యున్నాడు గదా అట్టివాడు మన పట్టణమందు లేడా మనకు దర్శనంబిచ్చి పుత్రభిక్షబెట్టడా పెట్టనియెడల మన మాచరించిన పుణ్యకార్యములన్నియు నష్టటగల్పనా? మంటబెట్టి కాల్పనా?

జయ— అట్లైన నీసంపూర్ణాభిప్రాయ మేమి?

శుక— యేమనియా? మనరాజధానియందే పశుపతినిగూర్చితపమాచరించుదము

జయ— దేవీ? నీయూహాకము శ్లాఘనీయంబుగా నున్నది నీయభిమత మే నాయభిమతము

సుబు— రాజేంద్రా? దేవిగారి యభిప్రాయ మే లెస్సగానున్నది

జయ— (సుబుద్ధి వంకజూచి)

ఆ॥ గీ॥ చంద్రమౌళిగూర్చి చయ్యనమనమింక
తపము జేయవలె ముదంబుమీర
గానచివ్రహేమ కలిశంబునొకదాని
దీసికొనియు రమ్ము యోసుబుద్ధి॥

సుబు— చిత్తము (నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) రాజా? ఇదిగో బంగారుకలిశమును పరిగ్రహింపుడు

జయ— (తీసుకొని) దేవీ యీకలిశమును పూజింపుము

శుక— చిత్తము

(కలిశము గద్దియపైనునిచి పూజించి భార్యాభర్తలు చేతులుజోడించి)

క॥ గౌరీవర పరమేశా
శౌరిస్తుత దీనపోష సన్నుతవేషా
కారుణ్య రసవిశేషా
కూరిమితో నన్ను బ్రోవుకోరితిమీశా॥

హేచతుర్భువన సంరక్షకా;

ఉ॥ తొల్లిటిజన్మలంను ఘనదోషము లేమియొనర్చినారమో
పిల్లలులేకనిట్లు విలపించుచు నుండితిమిప్పుడో జగ
ద్వల్లభ పుత్రసంతతి నపారకృపామతి గల్గజేసిమా
యిల్లునునిల్పుమయ్య యికనెట్టికి జాగొనరించెదయ్యయో.

దండకము

శ్రీపార్వతీప్రాణలోలా జగన్నాయకా సాధుహృత్పద్మవాసా మహేశా గిరీశా కృపాసాంద్రా భూతేశా సద్భక్తమందార యోదుష్ట సంహార యోయబ్ధిగంభీర యోమారగర్వాంతకా ఫాలనేత్రా హరా దివ్యచారిత్ర జంభారిసంస్తుత్య యీరేడులోకంబులం దెవ్వరెట్టెట్టి నినుర్ వర్ణనల జేయగాశక్యమే తొల్లిమార్కండేయుం గాచి శూలంబుచే కాలు గర్వంబుదూలించి సత్కీర్తి నార్జించినావయ్య యీశా? దురాత్ముల్ నినుంగానగాలేక సంసారవార్ధిన్ బడిన్ జచ్చుచున్ బుట్టుచున్నారలయ్యా శివా మామొరాలించి సత్పుత్రులంగల్గజేయంగదయ్యా యికన్ దాళగాజాలమయ్యా త్వదీయంగామితార్థంబులన్ దీర్చుమయ్యా మునీంద్రావనా పాహిమాం పాహి పాహి నమస్తే నమస్తే నమః—

(తెరలో) దంపతులారా యూరడిల్లుడు యూరడిల్లుడు

జయ— దేవి మనభక్తికి కచ్చెరువంది సచ్చరిత్రుండగు చంద్రశేఖరుడు రజతాద్రినుండి వచ్చుచు నూరడిల్లుడని పల్కుచున్నాడువింటివా

శుకి— నాథా వింటిని

(అ తటశివుడు ప్రత్యక్షమగుచున్నాడు)

జయ— శుక— (కరములు ముకిళించి)

సీ॥ దురితసంహారణ యురగేంద్రభూషణ
దీనప్రజారక్షణా నమోస్తు
పరమదయాకర పరమేశ చంద్రశే
ఖర యమగర్వసంహార నమోస్తు
సాధుసంస్తుతశీల సజ్జనపరిపాల
పురహార సద్గుణాకర నమోస్తు
శరణాగతత్రాణ సత్పాల శ్రీహర
కరకంఠగజచర్మధర నమోస్తు

గీ॥ సరసిజోద్భవవినుత శంకర నమోస్తు
గణపతిన్ గన్నవృషభవాహన నమోస్తు
చక్రధరమిత్ర ఫాలలోచన నమోస్తు
రజతగిరివాస గంగాధరా నమోస్తు॥

సుబు— మహాత్మా మీపాదపంకేరుహముల కివేవందనములు

జయ— మహేశా తమదివ్యమంగళవిగ్రహసందర్శనముచే గృతార్థుల మైతిమి

శివుడు— భూపాలా

ఉ॥ మెచ్చితినీదుభక్తికిని మెచ్చితి నీదగుసాధువృత్తికిన్
మెచ్చితి నీవిధేయతకు మెచ్చితి నీవొనరించుపూజకున్
వచ్చితి కామితార్థముల పారకృపామతితో నొసంగ నీ
కిచ్చగలట్టికోరికల వేవియొకోరుము సత్వరంబుగన్॥

జయ— చంద్రశేఖరా

గీ॥ అంతులేనట్టి సైన్యంబు నమితధనము
కినుక లేకుండ మీదుసత్కృపనుగల్గె
గాని యొక్కతనూజుని గాంచనైతి
నట్టికొఱతను దీర్చు మోయగనివాస॥

శివుడు— రాజలోకబిడౌజా

గీ॥ ఇదిగో నేనిపుడొక ఫలంబింపుమీర
దెచ్చితిని నీవు గైకొని దీనినీను
భార్యకొసగుము యామె యీఫలమునార
గించి యొక్క సుపుత్రినిగాంచ గలదు॥

కొన్నిదినములకు వంశోద్ధారకులైనకుమారులుగూడ జనించగలరు
(ఫలము చేతికిచ్చి యదృశ్యుడగును)

జయ— [గైకొని] ఆహా! యేమియీఫల సౌందర్యము సుబుద్ధీ
యిట్టి ఫలము నెందైన గాంచితిమా

సుబుద్ధి— కాంచ లేదు

జయ:— పూర్వజన్మసుకృతపరిపాకంబు మంచిదగుటచేతనే నాకిట్టిఫలములభించినది [భార్యవంకజూచి] దేవీ

చ॥ శిరములు తల్లక్రిందులుగ జేసి తపంబులొనర్చు సన్మునీ
శ్వరులె కనంగలేని నగవాసుని జూడగ నోచినాము, సు
స్థిరయశమందినార మొకచిన్నికుమారిజనించు నట్లుగా
వరముగడించినాము మనభాగ్య మికెంతనవచ్చు సుందరీ॥

నేటికి మనమాచరించిన పుణ్యకార్యము లన్నియు సార్థకములైనవి మనదుఃఖసముద్రమే సంతోషవారిగామారి యుప్పొంగుచున్నది దేవీ చంద్రశేఖరు డొసంగిన యీఫలమును గైకొని, యతఃపురమునకరిగి యొక్క సుముహూర్తంబున భగవత్ప్రీతికరముగా దీనినారగించుము. కతిపయ దినంబులకు గర్భంబుధరించి చక్కని పుత్రికారత్నమును గాంచెదవు. (ఫలమునిచ్చుచున్నాడు)

శుక— (అందుకొని) నాథా వెళ్ళుచుంటి నిదేనమస్కారము.

జయ— సుపుత్రికాప్రాప్తిరస్తు

( పిమ్మటశుకవాణి నిష్క్రమించుచున్నది.)

సుబు—ఆహా నేటికిగదా యీరాజదంపతులు కృతార్థులైరి

జయ— సుబుద్ధీ! నాకాఫలము లభించుటచేత సంతోష మంతకంతకు మితిమీరుచున్నది.

సుబు— మహీపాలా "కష్టేఫలీ"యనునట్లు కష్టపడినవారు ఫలమందు టసహజమేకదా

జయ— సుబుద్ధీ సంధ్యాకాలక్రమముచూచితివా

గీ॥ భానుడల్లదెపశ్చిమవార్ధిగుంక
బోవుచున్నాడు మేతకై పోయినట్టి
పక్షులన్నియు తమగూండ్లవంకమరలె
తారలనుగూడి సోముండు తరలెమింట

కావుననిక సభజాలింతము [ఇరువురు నిష్క్రమించుచున్నారు.]

( తెరవాలును )

ఇది ప్రథమాంకము.





శ్రీ

# చంద్రమతీపరిణయము

## ద్వితీయాంకము.



రంగము కాంపిల్యనగరవీథి.

[వంకాయల వెంకట్రామశాస్త్రులు, చాదస్తపు మర్కటావధానులు అనునిద్దరు బ్రాహ్మణులు నొకసేవకుడు ప్రవేశించుచున్నారు]

వెంకట్రా — (ఆయాసముతో) మర్కటావధానులుగారు నాకాయాసము మిక్కుటమైనదండి మాటగూడ బడిపోవుచున్నది.

మర్క — ఏమయ్యా అట్లనుచున్నావు యేమి యేమి

వెంక — ఇంకాయేమిటయ్యా యీపూట రామారావుగారి వ్రతకాల భోజనము నాకొంపదీసినది

మర్క — అంతమిక్కుటముగా బుచ్చుకొన్నారాయేమి

వెంక — మిక్కుట మేమిటండి యూపిరాడుట లేదు వ్రేలుబెట్టి చూచితే గొంతువరకెగదట్టి యున్నది

మర్క — ఊరకవచ్చినదని భుజించగనే సరియా హారాయించుకొనవద్దా

వెంక — ఏమిచేయమంచారండి చూచితే లేచిరాబుద్ధి పుట్టలేదు

మర్క — అట్లయిన నీతాంబూలము వేసికొనుడు జీర్ణకారి కొంచము సేపటికి నెమ్మతించగలదు

వెంక— అమ్మో అయ్యో యెంతపిచ్చవారలండి తాంబూలముపట్టె సందున్నయెడల ఆసందులో చివరకుపది గారెముక్కలైన సరికించ కుంకునటయ్యా

మర్క— సరేకాని, వచ్చిన బ్రాహ్మణోత్తములకెల్ల భోజనవసతిసరి గాజరిగినదా?

వెంక— సరిగా యేమిటండీ ఆవ్రితశాలలోనున్న స్త్రీపురుషులస్వభా వము లేమోకాని

చ॥ కడుముదమంది విప్రులతిగాజనుదెంచి రటంచు నెంచి, య
ప్పడములు, నేతిగారెలును, భక్ష్యము, లర్సెలు, మణ్గుబూవులా
వడలు, సమస్త శాకములు, పాయసమాదిగ బెట్టినారవి
ప్పుడమిని యట్టిసౌఖ్యయుత భోజనమెచ్చటనైనజూతుమే॥

ఈపొట్టకు బదులింకొకపొట్టను భగవంతుడు నాకేలప్రసాదింప రాదు

మర్క— (నవ్వి) యేకపొట్టకే యిట్లాయాసపడుచుండియు, నింకద్వితీ యపొట్ట సహాయము కోరెదవేమయ్యా కొంచెముసేపు కూర్చుం డుము.

వెంక— [కూర్చొనితాంబూలము వేయుచున్నాడు.]

సేవ— [తనలో]వీరికెంతసేపటికి తిండిముచ్చటు తేగాని వేరొండు లేదు.]
(ప్రకాశముగా )అయ్యలారా! మాజనవాథుడుమిమ్ము త్వరగాదో డ్కొనిరమ్మని సెలవిచ్చినాడు ఇకనైనదయ సేయుడు

ఒక— [లేచిబొజ్జనిమురుకొనుచు) అయ్యా, కొంతవరకాయాసము దగ్గినది ఇకమెల్లగా ప్రభుసన్నిధికేగుదముపద

(నిష్క్రమించుచున్నారు. [తెరవాలును.]

రంగము:— రాజుకచ్చేరి.

[జయసేనమహారాజు,సుబుద్ధి,కొందరుపురజనులు, ప్రవేశించుచున్నారు]

జయ— మంత్రిసత్తమా?

మ॥ కడుమోదంబున నీశుగూర్చి తపముల్ గావించిసత్పుత్రికన్
బడయన్ జాలితి, గష్టముల్ గడచె, వహ్వావంశముల్ నిల్పగా
గొడుకుల్ ముందుజనించువారలనినాకున్ దెల్పెనాదేవదే
వుడు,నన్ బోలు యదృష్టవంతులిలపై నున్నారె యోచింపగన్।

సుబు— మహీపాలా, సంపూర్ణచంద్రికళలన్ ధిక్కరించునికుమారి యుద్భవించుటనీకేగాక మాకునుగూడ సంతోషదాయకమే.

జయ— ఇకనాబాల దినదిన ప్రవర్ధమానయై సుగుణాకరుండైనభర్తను చేపట్టి సుఖయించు చుండగా, గాంచియానందించు భాగ్యమెప్పుడబ్బునాయని నిరీక్షించుకొని యున్నాడ. కాని బ్రాహ్మణులకొరకేగినదూతయింకను రాకున్నాడు కారణమేమై యుండునో

సేవ— మహీపాలా! జోహారు. భూసురోత్తము లరుదెంచుచుండిరి

పిమ్మట వెంకట్రామశాస్త్రులు,మర్కటావధానులు
ప్రవేశించుచున్నారు.

జయ— భూసురోత్తములారా నమస్కారములు

వెంక— మర్క— సుపుత్రిప్రాప్తిరస్తు

జయ— అయ్యలారా? యీపీఠంబులలంకరించుడు

వెంక— మర్క— ఆశీనులగుచున్నారు

జయ— (సంతోషముతో)

ఉ॥ భూసురులార, సద్గుణవిభూషణులార, మహాత్ములార, సం
తోసముతోడనాయఘము తూలగజేయదలంచిమీరు వేం

చేసితిరిప్పుడియ్యెడకు సిద్ధివహించె సమస్తకోరికల్
భాసుర మొప్పమీను పదపద్మములబ్బెనుపూజ సేయగన్॥

వెంక — రాజలోకబిడౌజా మమ్ముబిల్పించిన పనియేమి

జయ — విప్రోత్తములారా సమస్త ప్రపంచస్థితిలయకారణుండగు చంద్రశేఖరుని సత్కృపారసము వలన నాకు నేటికొక ముద్దుల కుమార్తెజనించినదిగాన నాపట్టిజనించిన తిథి వార నక్షత్రంబులుస రిగానున్న వేమోచూచి నన్నానంద రసాబ్ధినోల లాడించెదరని తలంచి మిమ్ముల బిల్పించితిని

వెంక — ఎప్పుడుద్భవించినది

జయ — మొన్నటి దినమున

[బ్రాహ్మణులిర్వురు వేళ్లులెక్కించుచు పైకి జూచుచున్నారు)

వెంక — (తనలో) ఔరా యీరాచపట్టి యుద్భవించినతిథి వార నక్షత్రంబులన్నియున్ గూడ గడున్ గడుబెట్టిదములుగా గన్పట్టుచున్న యవి ఈభూపాలు డెన్ని దినంబులనుండియో సంతతిలేక లెక్కలేని యిక్కట్లకోర్చి నేటికొక్క పుత్రికారత్నమున్ గాంచి మమ్ముబిల్పించిపూజించి: విప్రోత్తములారా నాపట్టి పుట్టినట్టి గడియలెట్లుండెనో చూచి చెప్పుడనగా

గీ॥ పుడమినాయకనీ సుతచెడుగడియల
జననమందెనటంచెటుసాహసించి
బల్కెదము బల్కకున్న చోపాపమొదవు
వెనుకగొయ్యిముందరనుయ్యి విధముదోచె॥

ఇక ముందెట్లు జరిగినను ప్రస్తుత మీతనితో బొంకులాడుట యే యుత్తమము [ప్రకాశముగా] మహీశా చెప్పుటకేమున్న దిగాని

మీవంటియెక్కువవారింట తక్కువయంశంబుగల వారెచ్చట నైన నుద్భవించుట గలదా

చ॥ అనఘుబ్రియంబుమీరవినుమారయ పున్నమనాటి చందురుం
డని బ్రజలెల్లసంతసమునంద వెలుంగుచునుండెగానన్
జనవరనీదుపుత్రికను "చంద్రమతీ" యనిపిల్వగాదగున్
జనియదమయ్య మేమికనుజాగొనరించ కనుజ్ఞనీయుమా॥

జయ— మహాప్రసాదము ఎవడురాలక్కడ

సేవ— అయ్యా యేమిసెలవు

జయ— మనసేనాధిపతియగు వీరాగ్రజునిబిల్వుము

సేవ— చిత్తము (నిష్క్రమించుచున్నాడు)

(పిమ్మట వీరాగ్రజుడు ప్రవేశించుచున్నాడు)

వీరా— పార్ధివేంద్ర నమస్కారము

జయ— వీరాగ్రజా వీరలదోడ్కొనిపోయి షడ్రసోపేతమైనభోజన సామాగ్రినిప్పించి

మ॥ కరులో భూములో సొమ్ములో రథములో గ్రామంబులో గో
వులో సరసీజాక్షులో పుష్యరాగతతులో సౌధంబులో యర్థమో
తురగశ్రేణియొ వస్త్రసంచయమొ సంతోషంబువాటిల్ల నీ
ధరణీదేవత లేవి గోరినసరె దానంబుగానీయుమా॥

వీరా— చిత్తము అయ్యలారా దయచేయుడు

వెంక— పోవుదముపద (వెంక మర్క వీరాగ్రజులునిష్క్రమించుచున్నారు)

జయ— బుద్ధిసాగరా

చ॥ స్థిరమతులైన విప్రులు వచించినపల్కులు విన్నమీదట
స్వరమ ముదంబెగాక విను బాలను నామతనూజనైను వ

త్సరముల యీాడుశాగనె హితంబుగవిద్యలసభ్యసించు స
ద్గురువరుసన్నిధిన్ నిలుపకోరికగూాడజనించెనిత్తఱ॥
కావునని కనట్టి ప్రయుక్నముగో చూడవలెర యు్మ
సుబు— మంచిది (ఇరువురునిష్క్రమించుచున్నారు)

తెర ప్రాలును

రంగము;— రాజ కచ్చేరి

[జయసేన సుబుద్ధులు ప్రవేశించుచున్నారు]

సుబు— రాజేంద్రా యేమంటివి
జయ— సకలకళాధురంధరుండని ప్రఖ్యాతివహించిన గురువు దగ్గర నాకుమారీరత్నంబగు చంద్రమతినుంచితినిగదా ఉంచిగూడ నిపు టికి చాలాకాలము గడచినది గావున

ఉ। ఇన్నిదినాంలనుండి గురుదేవ్యువినేర్పుచునున్నవాడో నా
చిన్నితనూజ చంద్రమతిచేరిగ్రహించిన విద్యలెంతలో
నున్నవియోవినంగమది నున్నదికోర్కెలసద్గురునాఖ్యనా
సన్నిధికిప్పుడే సుతనుసత్వరితంబుగ బిల్వనంపుమా॥

సుబు— సేవకానీవేగి (శ్రీ)రామావధానిగారియొద్ద చదువుచున్నచంద్ర మతికి మీాతండ్రిగారి యాజ్ఞయైనదని చెప్పి తోడ్కొనిరమ్ము
సేన— చిత్తము (నిష్క్రమించుచున్నాడు)

[పిమ్మట చంద్రమతి ప్రవేశించుచున్నది]

చంద్రమతి— నాన్నా నమస్కారము
జయ— చింతిత కళ్యాణ సమృద్ధిరస్తు
చంద్ర— బిలిపించినదెందులకు
జయ— తల్లీ చెప్పెదను వినుము (కుమార్తెను తొడపైనిడుకొని)

గీ॥ నాసఖానంబ నాదు రత్నాలమూట
నీకు గురుఁబెట్టి విద్యల నేర్పినాఁడొ
వినఁగఁగౌతూహలంబయ్యె గనుక నొక్క-
పద్యముఁ జెప్పి సంతోష పరుపుమమ్మ॥

యిదియే నిన్ను బిల్పించిన కారణము.

చంద్ర:— నాన్నా దేనిలోని పద్యము జదువమనెదరు?

జయ:—మీయుపాధ్యాయుఁ డేదిజెప్పెనో అది

చంద్ర:—తండ్రీ యొకటిజెప్పి యొకటిజెప్ప లేదననేల నీతిదాయకంబులైన సమస్త శాస్త్రంబులను గరపుచునే యుండిరి. ప్రస్తుతము మాత్రము పతివ్రత "మహాత్యము" లోని కొన్ని పద్యములు, వాటికర్థములు బోధించుచుండిరి.

జయ:— పోనీ యందలిపద్యమె యొకటి జదువుము

చంద్ర:—చిత్తము

సీ॥ పతితోడ కలహించి హితవు దప్పగనేల
పతియె దైవముగదా భామలకును
భర్తను పడనాడి పరపూరుషుల గూడి
చరియించుటేలను గరితలకును
సొమ్ములు లేవంచు, చుఱచుఱ పడనేల
మగఁడేగదా సొమ్ము మగువలకును
నాథుని చక్క-దనంబు హీనమటంచు
గునియంగ నేలనే వనితలకును

గీ॥ పుట్టినింటి పేరు మెట్టిన యిలుపేరు
నిల్పుటెంతొ గొప్ప నెలతలకును

మతిని వెదకిచూడు మతివలు పతిభక్తి

చేతగాదె భువిని ఖ్యాతిగనుట॥

నాన్నగారూ! యిట్టి పద్యము లెన్నియో చెప్పుచుండిరి.

జయ:—పట్టీ నీవిపుడొక చక్కని పద్యముఁ జదివి నామానసంబును సంతోషాబ్ధియందు ముంచి తేల్చితివి. నీవిక బడికేగు సమయము గాదు. చిన్నతనంబున నుండతిశ్రద్ధతో విద్యలఁ గఱపిన నీగురువునకు తగిన కట్నకానుక లర్పించి, నమస్కరించి, దీవనలఁ గాంచి, యంతఃపురంబున నుండుము పొమ్ము.

చంద్ర:—చిత్తము నాన్నగారూ నమస్కారము [నిష్క్రమించుచున్నది]

జయ:—(తనలో) ఆహా నాముద్దుల పట్టి నాబంగారుకొండ నాబాల సమస్తవిద్యల నెంతలో గ్రహించినది. కనుక నే పూవుపుట్టుట తోనే పరిమళమని పెద్దలనోట వెలువడినది (ప్రకాశముగా) సుబుద్ధీ కాలమతిక్రమించుచున్నది ఇక భోజనశాల కరుగుదము పద.

సుబు:—సరే రండు. [ఇరువురు నిష్క్రమించుచున్నారు]

(తెర వ్రాలును)

రంగము:— రాజుకచ్చేరి.

[జయసేన, సుబుద్ధులు, ప్రవేశించుచున్నారు]

జయ:—బుద్ధిసాగరా! శుక్లపక్షచంద్రునిరీతి దినదినాభివృద్ధిఁగాంచి, నాతనూజ పుష్పవతి యైనది అయినట్టి తిథి, వార, నక్షత్రంబు లెట్టులుండెనో చూచుటకు మరల జ్యోతిష్కుల బిల్పింపవలెను.

సుబు:—సేవకా నీవేగి పూర్వము చంద్రమతీ జనన కాలంబున దోడితెచ్చిన భూసురోత్తముల దీసికొనిరమ్ము

సేవ:—చిత్తము [నిష్క్రమించుచున్నాడు]

(పిమ్మట వెంకట్రామశాస్త్రిలు, మర్కటావధానులు
ప్రవేశించుచున్నారు)

జయ— మహాత్ములారా, వందనములు

వెంక— మర్క— దీర్ఘాయుష్యమస్తు.

జయ— అయ్యలారా! యీయుచితాసనముల నలంకరించుడు. మీ రాకచే మత్సదనంబు పవిత్రమైనది. నాజన్మ ధన్యమైనది.

వెంక— మహీపాలా? మమ్ముబిల్పించిన దెందులకు

జయ— తెల్పెదవినుడు.

చ॥ సరసగుణాఢ్యులార, ద్విజసత్తములార, సుకీర్తులార, నా
వరసుతి మీకృపారసమువల్ల రజస్వలయయ్యెగాన ని
ష్ఠరమర లేక నట్టిగడియల్ దిలకించి, యవెట్టులుండెనో
సరగవచించి నెమ్మదికి సంతసమున్ గలుగంగ జేయుడీ॥

వెంక— సీతనూజపుష్పవతియైన దెన్నడు..

జయ— పోయిన యష్టమీ మంగళవారమునాటి రాత్రి రెండవ జామున: (బ్రాహ్మణు లిద్దరు వ్రేళ్లులెక్కించుచు పైకిజూచు చున్నారు)

వెంక — (తనలో) ఔరా? యీ భూపాలుని ముద్దులపట్టి పుట్టిన గడి యలకుదోడు పుష్పవతియైన గడియలుగూడ చెడ్డవేయైనవి. ఇది వరకెట్లులో బొంకితిమిగాని ఇక బొంకుటకు వీలులేదు. ఇప్పుడు నిజము జెప్పకున్న యీరాజదంపతులకు కీడురాకమానదు. కీడు రావటమేమి? కొన్ని దినములకు రాజ్యభ్రష్టత్వ మొదవుటయేగాక రాజదంపతులకు మరణముగూడ తటస్థించును, ఈ దుష్కృతము

నను మిన్నకుండుటకును ఇట్టి నా? లోకాపవాదంబున పాల్గొననేల? భూ వల్లభుడు మాపై నాగ్రహించినను యదార్థ మెఱింగి చులకచు యుత్తమము.

మర్క — [తనలో] ఈ రాచకట్టి కడుచెడు గడియల యందుద్భవించి యంతకన్న దుర్ఘటమైన గడియలందే రజస్వలయైనది. ఇప్పుడీ నరేంద్రున కేమిజెప్పవలయునో తెలియకున్నది.

జయ— అయ్యలారా! దీర్ఘాలోచనలతోనే సరియూ త్వరగా వచింపుడు.

వెంక— మర్కటావధానులుగారు చెప్పండి

మర్క— వెంకట్రామశాస్త్రిలుగారూ తమరే చెప్పండి.

వెంక— ఎవరైననేమి మీరు జెప్పకూడదా?

జయ— విప్రోత్తములారా మీ కలహంబులతోనే కాలము జరిగిపోవు చున్నది ఐన నాకుఁదృష్టమునకు మీరేమి చేయగలరు. ఉన్నదున్నట్లు త్వరగావచించుడు.

వెంక— కానిమ్మా? యున్నవాస్తవ మెరింగించుటకు సంశయింపనేల [ప్రకాశముగా]

పార్థివేంద్ర నీవరపుత్రి జన్మించి
నట్టిగడియ లెంతో బెట్టిదములు
లేక లేకాక సుతమీకు గల్గె నటంచు
జెప్ప లేదు మొదట చిత్తగించు॥

దానికి తార్కాణముగా రజస్వలయైనగడియలుగూడ చెడ్డవేయైనవి.

జయ— అయ్యలారా? ఇట్టి దోసంబుపోవుట కేదేని శాంతి యున్నచో వచించుడు. అద్దానిని తప్పకయొనర్చి, భూసురులకు కోరినట్టి

దానము కొసంగెదను.

వెంక – మ॥ జననాథాగ్రణి యిట్టిదోసముఁ దలంచన్ శాంతిలేదయ్యయిం
కనూ నీబాలపురిన్ వసించిన మహాకష్టంబులున్ గల్గునం
చని సూచించుచునుండెగాన నిపుడత్యంతంబుగా నానెలం
తనుఖండించుటో, వేరురాష్ట్రమునకున్ దర్లించుటో
జేయుమా!

జయ— హర హర? యెంతటిమాట వినవలసివచ్చినది. హాతనయా చంద్రమతీ నేటికి నీకెట్టి యిక్కట్లు తటస్థించినవి. యెన్నియో మితిలేని కష్టములకోర్చి, చివరకు పరాత్పరుని కృపవలన నిన్నుగని, నీపైననే ప్రాణంబులు నిల్పుకొని జీవించుచున్న నీతల్లిదండ్రుల నేమిజేసిపోయెదవు. అయ్యో నాకేమి దోచుటలేదు. సుబుద్ధీ నా భార్యను బిల్పింపుము

సుబు— సేవకా? శుకవాణి నిచ్చటకు దోడ్కొనిరమ్ము.

సేవ — చిత్తము. [నిష్క్రమించుచున్నాడు]

జయ — హా ముద్దులపట్టి! హా రతనాలమూట! చేతులారనిన్నెట్లు ఖండింతును ఖండించుటకాని వేరురాష్ట్రంబునకైన నెట్లుబంపింతును. (సుబుద్ధివంకజూచి) సుబుద్ధీ నాతనూజ తగిన పురుషుని వరించి, సుఖించుచుండగా గాంచి, యానందించు భాగ్యమెప్పుడబ్బునా యనుకొంటినిగాని, యిట్లు జరుగునని కలలోనైన దలంచనయితినిగదా. (పిమ్మట శుకవాణి ప్రవేశించుచున్నది)

శుక— నాథా నన్నేల బిల్పించితిరి.

జయ— (దుఃఖముతో)

ఉ॥ ఇంతకు యేమునాము వచియించగలాడను, చేతులార నా
వంతగ్ని పారసంబనక పట్టినిఖండనజేసి, పిమ్మటన్
జింతను మగ్నిచచ్చునటుజేసెను విమ్మనునన్ను, శంకరుం
డెంతటి నిర్దయాత్ముడని యెంచగవచ్చును అక్కటక్కటా॥

ఇన్నాళ్ళల్లారు ముద్దుగాబెంచి, జననబుతుకాల ఘటికలు చెడ్డ
వగుటచే కుమారికిట్టి యిక్కట్లు తటస్థించినవి.

శుక— భర్తను [కౌగలించుకొని] హా నాథా మనబిడ్డకెట్టి యిక్క
ట్లానగూడినవి? [జయసేన, శుకవాణులు మూర్ఛిల్లుచున్నారు]

సుబు—ఆహా! యీరాజ దంపతులు కుమారికి గల్గిన కష్టంబులకోర్వ
జాలక చింతాకులమానసులై మూర్ఛావస్థయందు మునింగినారలే
వీరిదుఃఖోపశాంతికి మార్గమెయ్యది.

(పిమ్మట జయసేనసుకవాణులు మూర్ఛనుండి లేచుచున్నారు)

శుక— అయ్యో ప్రాణప్రియా! యీ యన్యాయమెందయిన గలదా.
నేటికి మనయాశలన్నియు తుదముట్టెనే కట్టడిదైవమెట్టి పనిజేయ
సాహసించినాడు, మన మొనర్చిన యపకారమేమి. స్వప్నావస్థ
యందైన నేమారకతన పదపద్మంబుల ధ్యానించుచుంటిమే మన
యందే యిట్టి పగబూనవలయునా! (దైవమునుద్దేశించి) ఓ శంకరా
హారా, చంద్రశేఖరా, ప్రపంచమున నీకెవరు గన్పించలేదా! దుర
దృష్టులమగు మాతనూజయే గన్పించెనా ఎంతకఠినాత్ముడవు గుణ
ములదొంతియగు కుమారినెడబాపి మమ్ము దుఃఖసాగరమందు
ద్రోయుట పాడియగునా.

సుబు— అమ్మా దుఃఖింపకుము.

జయ— సుబుద్ధిమాతనూజను వీడి ప్రాణవాయువుల నిల్పగలమా:

సుబు:— మ॥ ధరణీ నాయకమీరలీ కరణిచింతన్‌బూనగానేల, నా
సరసీజాసను వ్రాతదిద్దుటకునై శక్తుండెవండుండు, నె
వ్వరికేపాటువిధించునో యనుభవింపన్ గావలెన్ దాసస
త్తరి దుఃఖంబునుమాని మీమనముల్ ధైర్యంబునన్
జేర్పుడీ॥

జయ— అయ్యో యింకెక్కడి ధైర్యము భూసురుల పల్కులు విన్న
తోడనే ధైర్యబంతరించినది.

శుక— నాథా! బ్రాహ్మణోత్తముల పల్కులు సరిగావింటిరా పొం
బడలేదుగదా.

జయ— దేవీ సరిగానే వింటిని.

శుక— ఏమని చెప్పిరి.

జయ— నీపుత్రికా రత్నమును ఖండించుమనిరి. అట్లుగానిచో మది
యొక రాష్ట్రంబునకు బంపుమనిరి.

శుక— హా! యెంతఘోర మెంతిఘోరము. అయ్యో నాకడుపు బ్రద్ద
లగుచున్నది. కాళ్లు తడబడుచున్నవి. నేనిక నిల్వజాలను. (మరల
మూర్ఛిల్లుచున్నది)

సుబు— [తనలో] ఆహా నేనెన్ని జెప్పిన నేమి కన్నకడుపుగదా దుఃఖ
మెట్లు భరింపగలదు. (రాజువంకజూచి) రాజా? అన్నియుం దెలిసిన
మీరుగూడ ధైర్యము చెడిన లాభమేమి.

జయ— సుబుద్ధీ? యెంత ధైర్యంబవలంబించుద మనుకొన్నను దుఃఖ
మాగకున్నది.

శుక— (లేచి) అయ్యో, తలంచుకొన్నకొలది గుండెలవసి పోవుచున్న
వి [చంద్రమతినుద్దేశించి] హాబిడ్డా, చంద్రమతీ? ఇదివరకునీమృదు

పాదమునందొక ముల్లుగ్రుచ్చుకొన్న నాప్రాణంబు లెగసిపోవుచుం డెనే అట్టిదాన నిప్పుడు కరవాలంబుచే నిన్ను ఖండించు చుండగా జూచియెట్లుసహింపగలను.

జయ— అమ్మా నితనూజకు నీకుఋణము దీరినప్పుడు మిక్కిలిగాయు నుకొన్న లాభమేమి ఈజన్మంబులశాశ్వతంబులని నీవెరుంగావా. పుట్టినవారెప్పటికైన గిట్టవలసినదేగదా.

శుక— సుబుద్ధీనీవెన్ని నీతులజెప్పినను

ఉ॥ ఆనగుమోము, నాపెదవు, లానునుచెక్కులు, నామృదుస్వరం
బానయనంబు, లాకరము, లాకురు, లానొస, లాపదద్వయం
బానడ, కావిధేయతయు, నక్కటయెన్నిదినాలకైనను౯
గానిధరిత్రిపైమరువగా వశమౌనె యమాత్యశేఖరా॥

జయ— మిత్రమా భగవంతుడేత తంత్రమైనపని జేసినాఁడోయి

సుబు— రాజేంద్రా? యేలనీకీపిచ్చి

శ్లో॥ ఋణానుబంధ రూపేణ, పశుపత్నీసుతాలయాః
ఋణక్షయే క్షయంయాంతి, కాతత్రపరివేదనా

అనెడునీతి వాక్యంబునకు భిన్నంబుగలదా

జయ— ఔనుమిత్రమా నీపల్కులు సత్యములు

శుక— ప్రాణప్రియా?

సే॥ సరివారిపిల్లకు పరిణయంబగువేళ
మనపిల్లకెప్పుడో మనువటంచు
పెరవారియల్లుండు వేంచేయువేళల
మనయల్లుడెప్పు వచ్చునోయటంచు
నిరుగుకన్యత్రవారింటికేగెడువేళ

మనకూతు రెప్పుడో చనుటయంచు
పౌరుగువారలతనూజ పుత్రినిగను వేళ
మనసుత, సుతు నెప్డాగనుటయంచు
గీ॥ నాత్మదలపోసి యమితాశ నందియుంటి
నట్టినాయాశలన్నియు మట్టిజేరె
నాదుప్రియపుత్రికక విడనాడిధాత్రి
నెట్లుబ్రతుకుదు, నీదుఃఖ మెట్లుమరతు॥

(చంద్రమతిను ద్దేశించి) హాబిడ్డా నీసుగుణము లెట్లు మరువగలను

సీ॥ ఎప్పుడైన నామాట కెదురాడగా లేదు
జనకునాజ్ఞను మీరజాల లేదు
ఆటలయందైన నన్నృతమాడగ లేదు
బడియన్న చోశ్రమపడగ లేదు
అవిదెమ్ము యివిదెమ్మటంచు గోరగ లేదు
పొరుగింటికెన్నడు బోవలేదు
భుజియించునప్పుడైనపోరువెట్టుట లేదు
గురుసపర్యల మాను కొనుట లేదు
గీ॥ పరులు దూరుచునున్న కోపంబు లేదు
కపటమిసుమంతయైననుగాని లేదు
యిట్టిగుణములదాంతి వైనట్టినిన్ను
బాసి నేనుండి ఫలమేమి వరతనూజ॥

[ఇంచుకయూరకుండి] తల్లీ? శరత్కాల పూర్ణిమా నిశాకరబింబంబును మరపించజాలునీ వదనారవిందము చిరునగవు వెన్నెలచేవిరాజిల్లు చుండ నేత్రానందముగ జూడకున్నను, సుధారసంబున కేని లభింప

రాని మాధుర్యము జిందిపడు నీమృదుపలుకులు శ్రవణానందముగ వినకున్నను, నాబ్రతుకింకేమియున్నది. నీవొక్కదానవుగల్గితి వంతి యే చాలునని యెల్లప్పుడు నీపైననే ప్రాణవాయువులు నిల్పుకొని [illegible]ంచుచున్న నన్నే సముద్రము పాలుజేసి పోయెదవు. అయ్యో ధర్మ గారాపాదు బ్రాహ్మణులనేల బిల్పించవలెను. ఛీ ఛీ సుక్ర వాణీ నీవెంత యదృష్టహీనవు. అమ్మా చంద్రమతీ యీ నిర్భా గ్యురాలి గర్భమున జనించక, యే యదృష్టవంతుల గర్భముననో జనించిన చిరకాలము జీవించగల్గెద వేమోగదా ఎన్ని యోవ్రతము లాచరించి, నవమాసంబులు మోసి, కని నీముద్దుముచ్చటలకా నందించు నీ తల్లి యింకెవరిని జూచుకొని భూమిపై జీవించగలదు హా విధీ (అని ఘాలబడుచున్నది)

జయ:— ఛీ నాజన్మంబు నిజంబుగ సార్థకహీనంబుగదా (బ్రాహ్మణుల నుద్దేశించి) ఓ దుష్ట స్వభావులారా? బ్రాహ్మణాధములారా తుట్ట తుదకెట్టి పనిజేయ సాహసించితిరి భూసురుల నెంతకైన నమ్మగూడ దను వాక్యంబును సార్థకపరచుకొంటిరే.

సుబు — రాజా? యే ... కోపకారణము

జయ— [కోపముతో]

ఉ॥ ఎట్టిదురాత్మలాద్విజుల నేమనవచ్చును మంత్రివర్య నా
పట్టి జనించువేళలవి పాడుగ దోచిన మున్నె జెప్పకన్
గుట్టునయుంచ కృత్యమున కొంపనుగూల్చిరి గాన వారి ని
ష్పట్టున జీల్చి వేసినను పాతకమున్నదె బిల్వనంపుమా॥

సుబు— భూపాలా? యిందుభూసురుల తప్పేమియులేదు మెన్నియో కష్టములకోర్చి లేక లేక చివరకొక కుమార్తెనుగాంచినప్పుడు

సీతనూజ చెడుగడియలందు జన్మించినదని నీతో వారెట్లు వచించగ లరు. అదిగాక

గీ॥ నీదుపట్టి జనించిన దాదిగాను
మనపురీస్థలినశుభంబు బెనగుచుండె
నదియునాకును, పురజను లందరకును
దెలిసినీతో వచించుట కలికినాము.

శుక— నాథా? యివన్ని యేల. సద్గుణరాసియగు కుమారికిబదులుగా నన్ను ఖండించి, పిదప బంధుమిత్రాదులతో సుఖముగానుండుము.

జయ— దేవీ, యెంతటి వెఱ్ఱిదానవు.

గీ॥ బిడ్డపైనాకు నీకన్న పేరిమచాల
గలిగియున్నది యైనను ఫలమదేమి
బ్రహ్మ నొసటలిఖించెడు పగిదిగాక
నొకరికర్మంబు భరియించు టొకరితరమె॥

(సుబుద్ధివంకజూచి) సుబుద్ధీ? యెంతచింతించినను బ్రయోజనమేమున్నది దుఃఖము కొంతకాల ముండునుగాని యెల్లకాల మిల్లుగట్టుకొని కా పురముండదుగదా. మున్ను బొందిన సంతోషమునకు నిష్కృడనుభవిం చు దుఃఖమునకు సరిపోయినది ఐన మా దురదృష్ట దశ కెవరేమి జేయగలరు. చిన్నతనముననుండి యుల్లారుముద్దుగాబెంచిన తనూజను ఖండించుటకు నాకెట్లుచేతులాడును వేరురాష్ట్రమున కేగమనుటకై నోరెట్లువచ్చును మాసుతను నీసుతయే యనుకొని, యెట్లుచేసిన నట్టిభారమంతయు నీతలయందే మోపితిమి. నీకు దెలియని విషయ మేమున్నది. మేమిక గృహంబున కరిగెదము

సుబు:— సరే వెళ్లిరండు

శుక:— హా! ముద్దులపట్టీ, హా రతనాలమూట, కఠిన హృదయులగు నీతలిదండ్రులు నీకెట్టి శిక్ష విధించి వెళ్లుచుండిరి. బ్రతికియున్నంత వరకు నిన్నెట్లు మఱవగలను

జయ:— దేవీ? మనకుమార్తెగానప్పుడు మాటి మాటి కనుకొన్నలాభ మేమి ఇక గృహంబునకరుగుదము పద (జయ శుక నిష్క్ర మించుచున్నారు)

సుబు:— ఆహా! యేమి కాలవైపరీత్యము చతుస్సముద్ర ముద్రిత ధరణీపాలుఁడగు జయసేన మహారాజు గారి కుమారికా యిట్టి యిక్కట్లు? అయినను బుద్ధు లెట్లున్నను ధాత్రవ్రాతకు భిన్నంబులే మగదా ముద్దులపట్టిని ఖండించుటకుగాని, మరియొక రాష్ట్రంబున కు బొమ్మనుటకు గాని, తనమనంబొప్పక నెట్లుజేసిన నీవు జేయు మని భారమంతయు నాతలయందేనిడి నరపాలుఁ డింటికరిగినాడు గాన నిప్పుడు గర్తవ్యమేమి చంద్రమతిని ఖండించుటకు నాకుమా త్రమెట్లు చేతులాడగలవు పోనీ, యింకొక పట్టణంబున కంపినచో ఆరాజేంద్రున కెట్టి యపాయము వాటిల్లినను, చూచునట్టి పిన్న పెద్ద లందరు "కాంపిల్యనగరంబేలు జయసేన మహారాజుగారి కుమార్తె వలనగదా యీరాజునకిట్టియపాయము వాటిల్లె" ననిదూషించెదరు [కొంతవడి నాలోచించి] ఆ, యిప్పటికొక చిన్న యుపాయము దోచినది. చంద్రమతినొక మందసమునందుంచి, సమీపమందున్న బ్రహ్మపుత్రానదీ ప్రవాహములో బడవేయించెద. యింతకన్న వే రొండు సాధనము గనుపడుటలేదు. సేవకా? మనపురనివాసులగు వీరభటుల కొందరిని బిలువ్వుము.

సేవ—చిత్తము [నిష్క్రమించుచున్నాడు]

సుబు:— ఔరా? నామనంబెంతటి పాపకృత్యమునకు సమ్మతించుచు న్నది. ఐనను రాజాజ్ఞను నిర్వర్తించుట ముఖ్యముగదా

(పిమ్మట మల్లడు, కేశవుడు, వీరడు, జాంఘికుడు, అను నల్గురు భటులు ప్రవేశించుచున్నారు)

అందరు:— పెతానయ్యగారూ, దన్నాలండే

సుబు:— దీర్ఘాయుష్యమస్తు

మల్ల:— సోములెందుకో యేగిరంగా బిలిపిచ్చారంట?

సుబు:— మీవల్ల నొకపని నెరవేరవలయును

కేశ:— అయ్యోర్రు వసించండి సేత్తాము

సుబు:— మీలో నెవరికైన మచ్చుజల్లి మాయ జేయుట దెలియునా?

వీర— పెబువులు యిట్టున్నామని సూత్తుండారు కామాస్. మచ్చు జల్లి మాయజేయుటలో మా మల్లడు బగు దచ్చుడండే.

జాంఘి— ఒక మచ్చుజల్లటమే గాదు దొరా. యింద్రమాయేంద్రజాల యిద్దెలో ఒక్కొక్కల్లము మొనగాల్లము.

మల్ల— ఇప్పుడేరికి మచ్చుజల్లాలెనో చెప్పండిదొరా.

సుబు— చెప్పెద వినుడు

గీ॥ మనపురంబును పాలించు మనుజనాథు
తనయుపై మచ్చుజల్లి మందసమునుంచి
యుద్ధ రేతిరి సమయంబునందు మీరు
బ్రహ్మపుత్రానదిన్ బడవైచిరండు॥

కేశ— ఓరబ్బో ! యిది చాల కట్టతరమైన పనిరో బాబూ

వీర— ఉండసీ నీకుదెలియదు

మల్ల— రాండసీ పాపాల భైరవ్నాకైనేనుండలేదా

సుబు— వీరభటులారా? యీరాత్రికే యీపని పూర్తిగావలెను

అందరు— సిత్తము సిత్తము (నిష్క్రమించుచున్నారు)

సుబు— ఆహా? యీరోజుతో చంద్రమతికి పురినుండు ప్రాప్తము దీరినది. అట్టి గుణములదొంతి నిక నెంనైన గాంచుటబ్బునా? ఐన నాబాలామణిని రక్షించుటకై దేవతానీకమును బార్థించెదగాక

(ఆకసము వంక జూచి.)

సీ॥ పవలురాత్రులయందు వర్తించుచుండియు
సర్వముగను సూర్యచంద్రులార
పగలు గన్పడక రేయగపడుచుండియు
ధాత్రినిగనుగొను తారలార
జనులెట్టి తప్పుజేసిన దాచకుండనం
తయు దెల్పు పంచభూతమ్ములార
వినువీధి ముదమున విహరించుచుండెడు
గరుడ, గంధర్వ, కింపురుషులార

గీ॥ జననకాల రజస్వలా సమయములును
చెడ్డవగుటను జయసేను బిడ్డనిపుడు
బ్రహ్మపుత్రానదిఁ వేయబంచినాడ
సరగమీరలు నామెకు సాయపడుడి.

ఇక నేనిందుండి చేయునదేమున్నది. గృహంబునకరిగెదగాక

[సుబుద్ధి నిష్క్రమించుచున్నాడు]

(తెరవాలును.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# చంద్రమతీపరిణయము

## తృతీయాంకము.



బ్రహ్మపుత్రానదియొడ్డు

రంగము:— అరణ్యము

[దామోదర, గుణనిధి, పురుషోత్తమాది శిష్యులతో మయబ్రహ్మ ప్రవేశించుచున్నాడు.]

దామో— అహా? యీవనమృగంబుల మైత్రినెంత కొనియాడవచ్చును మిత్రరత్నములారా?

ఉ॥ ఈవనచోద్యముఁ గనుడి యేమనిదెల్పుదు గోపులుఁ బులుల్
భావములుప్పతిల్ల నొకపక్కఁ బరుండెను, జాతివైరముల్
లేవని నాకు దోఁచెను బళీ, కడుసంతసమిట్టి కాననం
బీవసుధాస్థలిఁ మనమికెన్నటికేనియు జూడనేర్తుమే.

గుణ— అవిసరేకావి యాకనుపడుచున్న సాలవృక్షంబునకు దూర్పు భాగమున దిలకించుడు

ఉ॥ పన్నగముల్, మయూరములు వాటిపగల్ దిగనాడియొక్కచో
నెన్నగరానిమైత్రి చరియించుచునున్నవి సింహముల్ కరుల్

మన్ననతోడనల్లవిగో మందగ గూడెను చెట్లనీడలఁ
గన్నులపండువై దనరెగావున నీవనమెన్నశక్యమే.

పురు— నెచ్చెలులారా?

క॥ అల్లదె చోద్యము చోద్యము
పిల్లులుఁ బెల్కలును జేరి ప్రేమనునొకచో
నల్లరిలేక పరుండెను
యుల్లాసమునాకు గల్గుచున్నదిగంటే.

దామి— మిత్రులారా, పూర్వజన్మసుకృత పరిపాకంబుమంచిదగుట చేతనే మనమిట్టివనంబును దర్శించగల్గితిమి [మయుబ్రహ్మవంక జూచి] గురూత్తమా; యీవనంబఖిల మృగ సంరక్షకంబై జాతి వైరములు లేక ప్రకాశింపుచున్నది. ఇట్లుండుటకు కారణమేమో తెల్పి మమ్మానంద రసాబ్ధి దేలించుడు.

మయు— శిష్యులారా? నామహిమాతిశయము వల్లనే యివ్వనంబిట్లు దనరారుచున్నది. అదిగో మనకు సమీపమునందే బ్రహ్మపుత్రానదీ ఘోషంబు వినంబడుచున్నది. ఆనదీజలంబులందు స్నాన సంధ్యానుష్టాది క్రియల నెరవేర్చుకొనుదము రండు.

శిష్యు:— చిత్తము (అందరుబ్రహ్మపుత్రానదికడకునడచుచున్నారు)

మయు:— ఆహా? యీనదీ జలంబును వర్ణించుట కేరికి తరంబు గాగలదు దినమునకొక విశేషము గల్గి ప్రకాశింపుచున్నది. ఔరా నేడెంత పుణ్యదినమని చెప్పవచ్చును [నదివంక జూపుచు]
శిష్యులారా?

సీ॥ కాంచుడు మీరలీ గంగాతరంగముల్
గగనభాగంబున నెగయుచుండె

కనుడిదె మీరలీ కంజాతముల షట్ప
దములు మరందంబుద్రావుచుండె
వీక్షించుడీ మల్లె విరజాజి, సంపెంగ
పొదలు పువ్వులతోడ పొసగుచుండె
పరికించుడీ నీటిపట్టున గుముగూడి
హంసలందంబుగ నాడుచుండె
గీ॥ నరయుడీ మీరలీ నదియందునుండు
పరిమళము గాలితో గూడి వచ్చుచుండె
మోదముప్పార బుడకోళ్లు నీదుచుండె
మనకు గన్నుల పండువై దనరుచుండె॥

ఇట్టి మహిమాతిశయంబుగల నదీజలంబులందు స్నాన సంధ్యాది క్రియ లాచరించిన మనకుండు దురితజాలము నశించుట కావంతయు సందియంబు లేదు. ఆలస్యమేల త్వరగా ముందు స్నానంబు లాచరించుటకు బ్రయత్నించుడు.

శిష్యు:— చిత్తము [అందరు నదిలోదిగి స్నానము చేయుచున్నారు]

[తెరలో]

—:మాలినీ వృత్తము. ముఖారి. చాపుతాళము:—

పరమగుణ విశాలా పార్వతీ ప్రాణలోలా
నిరతము మదిలోనన్ నీదు పాదాబ్జసేవన్
జరిపెదు లలితాంగిన్ జంపగా భావ్యమేరా
కరుణను ననువేగన్ గావగారావలేవా.

మయ:— (ఆలకించి) ఎక్కడిదా యార్తధ్వని. ఎవ్వరో యేడ్చుచున్న ట్లున్నది. శిష్యులారా? మీరందరాలకించుడు. (అందరాలకించుచున్నారు)

[ తెర లో ]

—:ద్విపద. ముఖారి. చాపుతాళము:—

దయలేద మీకైన తలిదండ్రులారా
ప్రియసుత నీనది వేయ బంచితిర
యింతకంటెను జనియించిననాడె
అంత మొనర్చిన నదిమేలుగాదె.

మయ— (మరలనాలకించి) అది నిక్కంబుగా స్త్రీ కంఠధ్వనిగాని పురుషునిదిగాదు. ఎవ్వరో యొక కాంత తల్లిదండ్రులచే విసర్జించబడి యీ బ్రహ్మపుత్రానదియందు వాపోవుచున్నట్లున్నది. అయిన మరల సందర్శార్థమూను నిశ్శబ్దముగానుండి యాలకింపుడు(ఆలకింపుచున్నారు)

[ తెర లో ]

—: మాలినీ వృత్తము, ముఖారి, చాపుతాళం :—

సురముని జనులారా చూడగా నాదువంకన్
కరుణను నెవరైనన్ గావగా లేర వేగన్
స్థిరమతివగు గంగాదేవిరో నీకుబిడ్డన్
సరగున దరిజేర్చన్ జాలవా నేరమానా.

మయ— శిష్యులారా? యిట్లు వాపోవుచున్న బాలికారత్నమును వదలిపెట్టిపోవుట భావ్యముగాదు శరీర యుతులమై భూమిపైజన్మించి నందుల కితరుల కుపకారమొనర్చుటయే ముఖ్యము. ఆయార్తధ్వని విన్నతోడనే హృదయంబునం దమితంబగు జాలిగల్గి నన్ను బాధింపుచున్నది. మీరిప్పుడేచని యాబాలిక నిటకు దోడ్కొని రండు

శిష్యులు— చిత్తము [అట్లు జేయుచున్నారు]

మయ— శిష్యులారా?మందసమునకు వేయబడిన తాళములు వదలించుడు

శిష్యు—(ప్రియత్నించి) గురువరా, యీ తాళములు మాకలవిగాకున్నవి

మయ— సరే మీరట్లుండుడు [తాళములు వదలించి] శిష్యులారా?
యీ బాలికామణి వాపోయి వాపోయి నీటిదెబ్బచే స్పృహదప్పి
పడియున్నది. ఏమి యీ సౌందర్యము. ఎవ్వరాయని వర్ణించుటకే
యలవి గాకున్నదే.

సీ॥ శ్రీవిష్ణునిఁ బాసి క్షితి జరించిటకునై
తరలివచ్చిన యబ్ధితనయ యేమొ
చంద్రశేఖరునితో జగడంబుసల్పి యీ
పగిది వచ్చిన హైమవతియొ యేమొ
పద్మసంభవునితో పంతంబుబూని యీ
గతి వచ్చినట్టి భారతియొ యేమొ
అమరనాయకునిపై నలుకచే నిట్టి వే
షంబుతో వచ్చిన శచియొ యేమొ

గీ॥ గాకయుండిన యీ దేహకాంతి యన్య
కాంతలందున జూడగాగలమొ, యీ నె
లంతనుఁ గాంచినంతనె మంతనమున
జాలిగల్గుచు నున్నదదేల నొక్కొ॥

శిష్యులారా? యీ కమండలముతో నుదకమును దెండు.

శిష్యులు— చిత్తము [అట్లుజేయుచున్నారు]

మయ— [కమండలోదకము ప్రోక్షించగా చంద్రమతి మూర్ఛనుండి
లేచును]

చంద్రమతి— హే మహాత్మా? మీ మృదుపదంబుల కిదే వందనము
(కాళ్లపై బడును)

మయ— (లేవదీసి)

ఉ॥ ఎవ్వరిదానవీవు, తరళేక్షణ యెయ్యది నీకులంబు నీ
వెవ్వరి యాత్మజాతవు, మరెయ్యది నీదునివాసభూమి, ని
న్నెవ్వరు యిట్టికష్టముల కేర్పడజేసిరొ దాచకుండగన్
జవ్వని దెల్పగాగదవె సారెద నిన్నొకబిడ్డరీతిగన్॥

చంద్ర— మహాత్మా? కాంపిల్యనగరం బేలు జయసేనమహారాజు తనూ
జను నా తల్లిదండ్రులు చంద్రశేఖరుని వర ప్రభావంబుచే నన్ను
వడసిరి. నేనుద్భవించిన తిథివారనక్షత్రంబుల నెయుటకై మాతండ్రి
జ్యోతిష్కుల బిల్పించెను. వారరుదెంచి నీబిడ్డ జనించిన ఘటికలు చె
డ్డవనిచెప్పుటకు మనంబులొప్పక మంచిఘటికలయందే జనించినదని
చెప్పి వెడలిపోయిరి. పిమ్మట కొన్నిదినములకు నేను రజస్వలనైతిని
అపుడుగూడ మాతండ్రిగారా జ్యోతిష్కులనే పిల్పింపగా, వారు రా
జేంద్రా నీతనూజ పుట్టినగడియలు మంచివిగావు. జననకాలమునందే
వచించుటకు మామనంబులొప్పలేదు. ఇప్పుడు రజస్వలయైన గడి
యల తెకిన్న దుర్ఘటము లెసవి ఈదోసంబు పోవదగుశాంతి గూడ
గన్పట్టదు. కాబట్టి నీతనూజను వేరుపట్టణంబున కంపించుటో, లే
క చంపించుటో జేయుమని తెల్పి వెడలిపోయిరి ఈవృత్తాంతమం
తయు నేనొక చెలికత్తె మూలమున వింటిని. నిర్దయాత్ముడై యర్ధ
రాత్రివేళ నన్ని బ్రహ్మపుత్రానదిలో బడవేయుంచిన తండ్రి యి
క నన్నేట్లు జేసెన నీదేభారము.

మయ— తల్లీ దుఃఖింపకుము నీచెడుగడియలన్నియు నాయమోఘా
శీర్వచనములచే మంచివగును అనన్య సత్యనిష్ఠాగరిష్ఠుండైన యొక
రాచకుమారునకు నీవిల్లాలవగుదువు నీకెట్టికొరంతలు లేకుండనే

సాకెదను నీజనకుడట్టివాడో యట్టివానిగా నన్ను భావింపుము

చంద్రి — జనకా? నీయపార కృపకు మిగుల సంతసించితిని నామది యందుగల దిగులంతయు నశించినది ఇకనాకు దిక్కు నీవే

మయ — అమ్మా మదీయాశ్రమమున కరుగుదము పద శిష్యులారా రండు

శిష్యులు — చిత్తము [అందరు నిష్క్రమించుచున్నారు]

(తెరవాలును)

రంగము వనప్రాంతము

[చంద్రమతియు, చెలికత్తెయగు పుష్పవేణియు ప్రవేశించుచున్నారు]

చంద్రి — చెలీ, మాతండ్రిగారగు మయుని ప్రభావంబు వర్ణించుట కెరికితరంబుగాగలదు ఆమహాత్ముని కృపావిశేషంబుననే గదా నేని ట్టి సౌఖ్యము లనుభవించ గల్గితిని

పుష్పవేణి — ఔను

చంద్రి — సరేకాని మాటల సందడిని మరచిపోయితిని విహారార్థము మనమేగ నిశ్చయించిన వనంబింకను రాకున్నదేమి

పుష్ప — తల్లీ సమీపించితిమి

మ॥ అదిగో ముందర పెద్దమఱ్ఱి కనుమీ యందంను వృక్షాళిపై
ముదమొప్పారగ కీర, శారికలు, గుంపుల్ గుంపులుగా గూడియుగా
మ్మృదు వాక్కుల్ ప్రకటింపుచుండె వినగా నింపయ్యె నివ్వేళ న
య్యది యే బోవగనున్న యట్టివనమో యబ్జాతపత్రేక్షణా॥

కావున కొంతవడి నచట విహరించి వెళ్లుదము రమ్మా

(అని చేయిబట్టుకొని తీసుకపోవుచున్నది)

చంద్రి — సఖీ, పుష్పవేణీ? యీవనరామణీయకమెంత యింపుగానున్నదే

సీ॥ మాతులుంగ, లవంగ, కేతకీ, కురవక
కుటజ, హింతాల, తక్కోల, తాల
వంజుళ, ఖర్జూర, వట, కుంద, పిచుమంద
కందరాళ, శిరీష, గంగరేగు
చందన, మందార, జంబీర, కరవీర
చంపక, మాధవీ, సాల, బిల్వ
సిందువార, కదంబ, చేమంతి, నాగ, పు
న్నాగ, భల్లాతక' నాళికేర
గీ॥ సరళ, పన, సామ్ర, లుంగ, కాంచన, కపిద్థ
క్రముక' నారంగ' కదళి, కురంటకాది
విటపిపంక్తులుగల్గి శోభిల్లుచుండె
మనకు గన్నులపండువై దనరునట్లు॥

పుష్ప— ఈవనదేవత యెంతయో మనయెడల ప్రేమ జూపుటకై యిట్టి విశేషములతో దనరారుచున్నది. ఆహా! ఆపూలమొక్కలె ట్లున్నవో దిలకించుము

[పిమ్మట హరిశ్చంద్రుడు ప్రవేశించుచున్నాడు]

హరి—(కోపముతో) ఔరా! యీ మాయవ్యాఘ్రంబు నన్నెంతలో మోసపుచ్చి యిటు పరుగెత్తుకొని వచ్చినది. కానిమ్ము దీనినింతట నైన వదలిపెట్టుదునా? ఈకొండ గుహాలలో నెందు డాగియున్నదో కడు జాగరూకతతో నరసెదగాక [ముందుకు నడచి] అదిగో నామాటలధ్వని విని యీవంకకు బరుగెత్తినది. (విల్లు సవరించుచు) ఓక్రూరవ్యాఘ్రమా? నీవు నాబారినుండి తప్పించుకొన జాలవని మొదటనే చెప్పలేదా? ఇదిగో యీబాణము దెబ్బ చవిజూచి

[illegible] [illegible]

(తెరలో పెద్దధ్వని)

చంద్ర— చెలీ, యావంక నేదియో పెద్ద ధ్వని వినవచ్చుచున్న దేమి?

పుష్ప—అమ్మా ఇట్టిమహారణ్యమధ్యమున నేదియో ధ్వని వినరాకుండునా

చంద్ర— ఏమె నిర్ధైర్యము నాకు మాత్రము మిగుల భయము గొల్పుచున్నది ఇక మెల్లగా గృహంబున కరుగుదము పద.

పుష్ప— ఇప్పుడేగదా వచ్చినది ఇంతలోనే తొందరించెద వేల

(మరల హరిశ్చంద్రుడు ప్రవేశించుచున్నాడు)

హరి— ఔరా? యామాయ బెబ్బులి నన్నెంతటి శ్రమల బెట్టినది! ప్రాణమిత్రుని సైతము వదలి దానికొరకై నిటు బరుగెత్తుకొని వచ్చితిని. ఇప్పటికిమాత్రి మది నాచే గూలినది. ఇక దాని కళేబరమును మాసత్యకీర్తికి గనపరచెదగాక (అని నడచుచు చంద్రమతి పుష్పవేణులగ్ గాంచి) ఆహా యీ కాంతామణులెవ్వరు? వీరి దేహకాంతు లీవనంబును చంద్రకళలరీతి వెలుగింప జేయుచున్నవె!

ఉ॥ కిన్నర కామినీ మణులొ, కింపురుషాంగనలో, మహీశ సం
పన్నుల భార్యలో, గరుడభామలొ, యక్ష సరోరుహాక్షులో
పన్నగవంశ సంభవులొ, స్వర్గపురంబుననుండు వేశ్యలో
యెన్నగ రూపవైఖరుల నెవ్వరు వీరిసమానులీభువిన్॥

[పరికించి] వీరిరువురలో కుడిచేయిప్రక్కనున్న కాంత యొకరాచ పట్టియనియు, రెండవది యాపె చెలికత్తెయనియు దోచుచున్నది. సెబాస్, యేమి యీరాచసుమాంగి యందము

సీ॥ ఈకల్కి పల్కుల కెనగాక కాబోలు
చిలుకలు సిగ్గుచే తలలు వంచె

నీభామ చూపుల కెనగాక కాబోలు
హరిణముల్ పొదరిండ్లయందు డాగె
నీయింతి నడకకు నెనగాక కాబోలు
కరులెల్ల నొకమూల కరుగసాగె
నీలేమ పదముల కెనగాక కాబోలు
పద్మముల్ నీటిలోపల మునింగె

ఆ॥ వె॥ నీ లతాంగివేణి కీడురా భయమంది
పుట్టలందు దూరె భుజగ సమితి
యీశరీరకాంతి నెల్ల గాంచుటకు నా
రెండుకనులు చాలకుండె నహహ॥

స్త్రీరత్నంబన్న బిరుదీ లతాంగికే చెల్లునుగాని తక్కినవారి కర్హనీయం
బుగా నేరదు సందియమేమి

సీ॥ సంపూర్ణచంద్రుని సరిదూగు నెమ్మోము
కమలంబులను గేరు కన్నుదోయి
తుమ్మెద రెక్కలన్ దూరెడు నెరికురుల్
దానిమ్మగింజలే దంతచయము
తామర తూండ్లను తలదన్ను కరములు
దబ్బపండుల బోలు గుబ్బచనులు
కేసరిన్ గని గేలిజేసెడు మధ్యంబు
నరటికంబము లేలునట్టి తొడలు

గీ॥ కలిగి విహరించుచున్నదీ కలికిమిన్న
నలువ తనసృష్టికౌశల మిలను జూప
నెంచి యీరీతి సృష్టిగావించెనేమొ

గాకయుండిన యీ తీవి గలదె యెందు॥

చంద్ర— చెలీ, పుష్పవేణీ, యీ వృక్షములపొంత మయూరములు తమపింఛములు విప్పి యెట్లాడుచున్నవో జూడుము

పుష్ప— అమ్మా, యీ వనమునందొక చిత్రముగల్గి యొక చిత్రి లేకున్నదా.

చంద్ర— ఇదిగో యీ వంకజూడుము.

గీ॥ చూతవృక్షావళులయందు శుకములట్లు
గుంపుగూడియు జూడ బల్ సొంపుమీర
మధురమౌ పల్కులను బల్క మదికి నెంతొ
సంతసముగల్గుచున్నదే యింతిమిన్న॥

హరి— ఆహా!

ఉ॥ చూచితి యక్షకామినుల, జూచితి దేవ సరోరుహాక్షులన్
జూచితి కిన్నరాంగనల, జూచితి ఖేచర సిద్ధకన్యలన్
జూచితి రాచకన్నియల, జూచితి నూర్వశి; మేనకాదులన్
జూచినచోటనిట్టి సొగసుందనమే కనుపింప దెచ్చటన్॥

చ॥ వనమున కందదుంపలను భక్షణజేయుచు నిశ్చితాత్ములై
కనుగవమూసి ఘోరతప కాంక్షవహించెడు మౌనులైననీ
వనజదళాయతాక్షి యెలప్రాయము, రూపము, నీటు, గోటు,
జూచిన భ్రమగల్గి దాసులయి చిక్కరె పూవిలు కానిబారికిన్

తే॥ గీ॥ కల్కిగాదిది, మరుచేతిములికిగాని
యింతిగాదిది, పువ్వులబంతిగాని
కొమ్మగాదిది, బంగారు బొమ్మగాని
బోటిగాదిది, రతనాల మూటగాని॥

ఈచంద్రవదన యేమహానుభావునకు జన్మించి, యేభాగ్యశాలిగృహంబు పవిత్రము సేయనున్నదో వానిదేజన్మము. నాకు దేవాదృష్టము వానద భాగ్యము నడేమిగాని యీకాంతామణిని గాంచినంతనే మన్మథుడు మాత్రము నాపైపువ్వుటమ్ముల గుప్పుచున్నాడు. పో యిపలుకరించు నంతవరకు నామనసాగునట్లు దోచదు. ఇప్పుడు సమీపించి నాకోర్కెను వెల్లడించిన నెరవేర్చునో లేదో; నెరవేర్చకున్న కష్టముగదా. ఐనను దాపునకరిగి ముందు బలుకరించి చూచెద [ముందునడిచి] ఛీఛీ చిత్తమా? కష్టంబుల కాకరంబైన యీ ఘోర పాతకంబు నన్నేల దొరికించెదవు.

ఉ॥ చూడగ నన్యకామినుల జోక్యము లెత్తగరాదటంచు, చే
కూడు నఘంబటంచు; యమకూపము గల్గునటంచు, కష్టము
ల్గోడగునంచు సద్గుణవిదుల్ వచియించగవింటి నక్కటా
కూడమినన్నుయిట్లు పురిగొల్పకు చిత్తమ, నీకు మ్రొక్కెదన్॥

చ॥ వెడలుబలంబు, భవ్యగుణవేత్తలు ఛీయనుచుందు, సద్యశం
బడగు, ధనంబు సున్నయగునార్యులుమెచ్చరు, బంధుగుల్, సఖు
ల్విడువగ నెంతుర్, తండ్రి యదలించును, తల్లిసహింపబోదుయీ
చెడుపని కేల లాగెదవు చిత్తమ, నీకు నమస్కరించెదన్.

[విచారించుచు కొంతవడినిలచి] అయిన పలుకరించిన తప్పుగాదుగదా పలుకరించకున్నవారి యుదంతము నాకెట్లుగోచరమగును

[అనిమెల్లగా సమీపించుచున్నాడు]

చంద్ర— (చూచి) చెలీ మాతండ్రిగారు మనకొరకై వేచియుందురు ఇకత్వరగా గృహంబున కరుగుదముపద [నడచుచున్నారు.]

హరి— (చంద్రమతి కడ్డముపోయి)

ఉ' ఎవ్వరిదానవే సరసిజేక్షణ, మెయ్యది పేరు నీకులంబు, నీ
వెవ్వరి పుత్రికామణివి, మెయ్యదిపేరు, నివాసమెద్ది, నీ
విప్వనభూమియందు చరియించెద నేలనె, నిన్నుగాంచగ
బువ్విలుకాడు నాపయిన పుష్పశరంబులు వేయసాగెనే

చంద్ర— [తనలో] అకటా యీతడెవడో నన్నిట్లడ్డగించుట యేగాక పైపెచ్చు దుర్భాషలాడుచున్నాడు. యీతని యభిప్రాయమంతయు చివరమాటయందే తెలిసినది. నేను విహారర్థమై చెలితో సిన్వనంబున కేలవచ్చితిని వచ్చినతుత్వరగా గృహంబున కరుగక నీవనశృంగార మునరయుచు నాలస్య మేల గావించితిని. అయిన నిప్పుడీ తడడిగిన మాటలకు బదులుజెప్పకుండుట భావ్యముగాదు [ప్రకాశముగా] రాకుమారా? నేను మహాతపఃప్రభావుడగు మయబ్రహ్మతనూజుడను! చంద్రమతి యనుదానను విహారార్థమై చెలితోనివ్వనంబున కరుదెంచితిని ఇకనీసంగతిదెల్పుము

హరి— నాసంగతి నట్లుంచుము. కానినీకువివాహమైన దా?

చంద్ర— లేదు

హరి— (తనలో) ఆహా? యేమినాభాగ్యము. యీ బోటికింకను వివాహంబుగాలేదట తప్పకనన్ను వరించకుండునా యనుయాశ మాత్రమునామనసునకు దట్టినది ఇకమెల్లగా సామవచనంబులచే నీసుందరాంగిని నాస్వాధీన పరచుకొనియెద (ప్రకాసముగా) పూర్ణేందు వదనా? నాచిత్రను వినగోరితివి గాన యిటువినుము

గీ॥ ధరణియందున శ్రీయయోధ్యా పురంబు
    నేలునట్టి త్రిశంకున కేనుసుతుడ

వరహరిశ్చంద్రు డనియెడు వాఁడ నీవ
సమున వేఁడెద నద్భుతి భ్రమరవేణి॥

ఇంతవరకు నాకుఁగూడ వివాహము గాలేదు గనుక నన్నుఁ బెండ్లియాడుము సకల సౌఖ్యము లనుభవించెదవు

చంద్ర— (సిగ్గుచే తలవాల్చి మిన్నకుండును)

హరి— ముద్దుగుమ్మా? తలవాల్చి మిన్నకుంటివేమి?

ఉ॥ నిక్కము జెప్పుచుంటి విను నీపయిఁజిక్కిన మనంబు నన్నుఁ దా
సుక్కఁగఁజేసె నీగతిని, చూడవె నాదెస తాళజాల న
టక్కరి మారుఁడమ్ములు హటాహటిఁ గుప్పుచునుండె నేవెసన్
జెక్కిలి ముద్దొసంగి నను జేర్చుకొనంగదె బిగ్గ కౌగిటన్॥

చంద్ర— [తనలో] ఆహా? ఈత డంతకంతకు పెచ్చుమీరుచున్నాఁడే ఇక నేనేమి జేయుదును. వీని నిట్లు జెప్పిచూచెదఁగాక (ప్రకాశముగా) హరిశ్చంద్రా? ఏకాంతమందున్న స్త్రీలతో నీవిట్లు దుర్భాషలాడుట భావ్యమగునా?

హరి— చిలుకల కొలికీ. నీవిట్లు బలికిన నేనేమి జెప్పగలను. చంద్రుని నైతము గ్రిందు పరుపజాలు నీ వదనారవిందమును దిలకించిన మాత్రముననే నాహృదయంబున కమితానందము గల్గుచున్నది. వేయేల చక్కర బొమ్మవగు నీతో సౌఖ్యము లనుభవించగల భాగ్యమందరకు లభించునా? నాతో ముచ్చటించుచు యెంతసేపని యీ పాడు కటికు రానేలపై నిలిచియుండెదవు. చిగురువంటి నీపాదము లెంత నొచ్చినవో గదా. కొంతవడి విశ్రాంతికైనా యంకతలంబున నాసీనవగుదువు రమ్మ [అని చేయిబట్టుకొనబోవుచున్నాడు]

చంద్ర— [తప్పించుకొని కోపముతో] ఛీ కలుషాత్మా. చాలు చాలు

దూరముగా నుండుము. కన్నియ యను భావంబు లేక నాదరి జేర కరంబు బట్టవచ్చెదవుగా రాజులకుండవలసిన మర్యాదలివియేనా? రాజ్యమదాంధకార మేమైన కన్నుల కెగదట్టునా యేమి? ఈసంగతి మాతండ్రిగారకు మయున కెరింగించితినేని, పిడుగువంటి శాపము చే నిన్ను భస్మమొనర్చును. అన్యాయముగా నేల జెడిపోయెదవు. వచ్చినదారినే మరలుము.

హరి— [దీనవదనుడై] కన్నియవు గనుక నేకరంబు బట్టవచ్చితి నిందు తప్పేమి యున్నది.

సీ॥ కల్యాణి నాపైన కరినంత జూపకే
　　　　శీఘ్రమే నీచెంత జేర్చుకోనవె
　మోహనాంగిరో యొక్క ముద్దిచ్చి నన్ను సం
　　　　తోష వారధియందు దోయగదవె
　కీరవాణిరో యెంతో సారమైనట్టి నీ
　　　　మోవి పానకమిచ్చి బ్రోవగదవె
　సారంగనేత్రి నీచనుబంతు లందిచ్చి
　　　　మన్మథ బాధను మాన్పగదవె
గీ॥ తోడివారలలో మన మీాడుజోడు
　గలిగియుండిన నెంతయో ఘనతగాదె
　కన్నడ యొనర్చి బోకింక వన్నెలాడి
　నిన్ను విడనాడి నేనెట్లు నిల్వగలనె॥

చంద్ర— హరిశ్చంద్రా ఇంకనీపిచ్చిసంగము లు జాలించి మరలిపొమ్ము.

హరి— కురంగ నేత్రీ? నాపై నీకిట్టి పంతమేల యేమంటివి నీపి ప్రసంగము జాలించి మరలి పొమ్మనుచుంటివా వినుము

ఉ॥ నీనగుమోము, నీకురులు, నీకనుసోగలు, నీను చెక్కిళుల్,
నీ నవ మోహనాకృతియు, నీచనుబంతులు, నీకరంబులున్,
నీనెరనీటు నీకులుకు, నీచెలువంబును చూచి చూచియున్
నేనెటుబోవువాడ తరుణీ మణి నాకెరుగంగ జెప్పవే॥

చందనగంధీ "అహింసా పరమోధర్మ" యనునట్లు నన్నుబట్టిన మన్మథ గ్రహంబును వదలించి పుణ్యముగట్టుకొనుము. లేకున్న నన్ను దక్కనివ్వదు

చంద్ర— హరిశ్చంద్రా?

సీ॥ ఎన్నోవిధముల జెప్పుచు నున్నవినక
మోహవారధియందున మునిగినాడ
నందు గంతులు వైవగా నగునె నీకు
యెవ్వరైనను విన్నచో నవ్వగలరే॥

హరి— పూర్వుబోణీ యెవ్వరు నవ్వినను, యెవ్వరు కాదన్నను, మన మిరువ్వర మేకచిత్తులమై యుండిన మన దాంపత్యమునకు కళంకము గలదా ఏలచెడిపోయెదవు నామాటవినుము

చంద్ర— హరిశ్చంద్రా? ఆమాటమాత్రము మరచిపొమ్ము

హరి— [తనలో] ఆహా? యెంతవేడిన నీసుందరాంగికి నాపై దయ రాకున్నదే (ప్రకాశముగా)

ఉ॥ కాంతుకటారి నీసొగసు గన్గొని మిక్కిలిభ్రాంతినొందుచుం
జెంతకు జేరి, మారునకుజిక్కితి రక్షణసేయుమంచు నే
నింతగవేడుచుండినను, యేలనొ నీమనస్సు యిప్పుడా
వంత గరుంగకున్న దది వజ్రమొ, రాయియొ, గాక లోహమో॥

చంద్ర— [తనలో] ఆహా? యమృతరసంబుజిల్కు యీతని మృదు

పల్కులు నాకోపభావంబు నెంతలో మరల్చినవి ఇట్టి నవమోహ
నాకారునితో సౌఖ్యము లనుభవించుటకన్న వేరొండు భాగ్యమే
మున్నది యేసుందరాంగి ఈసుందరాంగుని భర్తగాబడయగోరియు
న్నదో దానిదేజన్మ దానిదే యదృష్టదశ దానిదే పుణ్యము [ఇం
చుక యూరకుండి] నాదృష్టిమాత్రమీతనియందే నిల్చినది, ఇం
తదనుక మన్మథాగ్ని కెట్లో సహించితిని గాని యికమీద సహిం
పజాల నాయభీష్టమిప్పుడే విన్నవించుదమనుకొన్న వెంబడినాకీ చె
లికత్తె డాపరించినదే నేనిప్పుడీమహానుభావున కేమని ప్రత్యుత్తరం
బిచ్చెదను [ప్రకాశముగా] పుణ్యపురుషా? యెంత జెప్పినను వినక
పెడదారినే త్రొక్కుచుంటి రేల

హరి— [తనలో] ఇప్పుడీ చంద్రవదన యేమియో దీర్ఘాలోచన జేసి
చివరకునన్ను "పుణ్యపురుషా" యని పిల్చినది ఈమె నన్ను వరించుట
కంగీకరించెనా యేమి అంగీకరించినచో నాయదృష్ట మేమనవచ్చు
ను అయినను మరల నిటుల ప్రార్థించిచూచెద [ప్రకాశముగా] శత
పత్రేక్షణా? నాయభీష్ట మీడేర్చవా నీపై నింతటియాశ బెట్టుకొనివ
చ్చిన నన్నిటుల జేయుట భావ్యమగునా పోనీ నన్ను వివాహమా
డకున్న నొక్కసారి నాకోర్కెనయిన దీర్చుము నీవీసమయమున
దయజూడకున్న నాకింకదిక్కెవ్వరు? నేనెవ్వరివాడ నగుదును

చంద్ర— హరిశ్చంద్రా?

శా॥ నాతో నీవిటు లాడగాదగదు గానన్ వేగమే వచ్చియు
న్మాతండ్రిన్ గనినీయనుంగు సుతనిమ్మాయంచు బ్రార్థించుమా
యాతండంతట నన్ను నీకొసగి కల్యాణోత్సవంబెంతో సం
ప్రీతిన్ జేయును, పిమ్మటన్ మనము ధాత్రిన్ సౌఖ్యముల్ బొందనౌ

నీకు నిశ్చయముగా నన్ను వివాహ మాడవలెనని కోర్కెయున్న యెడలనిటుల జేయుము

హరి— [తనలో] ఆహా? ఈకాంతామణికి నాయుపదేశ వాక్యము లి ప్పటికి తలకెక్కినవి [ప్రకాశముగా] పూపుబోణీ నీవు జెప్పినది స మంజసముగానే యున్నదిగాని నాకొక సందేహము గలుగుచున్నది

చంద్ర— ఏమిసందేహము

హరి— నీతండ్రి మహాతపఃప్రభావసంపన్నుడు అందులో మునీశ్వరులు ముక్కోపులు అట్టివాని దగ్గరకువచ్చి నీకుమార్తెను నాకిచ్చివైవా హికము జేయుమని యడుగగా నన్ను కోపించునో శపించునో గదా ఎట్లు రాగలను

చంద్ర— పురుషాగ్రగణ్యా అటులెన్నటికిని జరుగబోదు

హరి— సరే ఆసంగతి ముందెటుల జరుగునోగాని నీమనసు మాత్ర మెవరిపై బారియున్నది?

చంద్ర— నీపైననే

హరి— ముమ్మాటికి?

చంద్ర— ఆ ముమ్మాటికి నీపైననే బారియున్నది

హరి— [సంశయార్థముతో] అట్లయినచో ఈకార్యము తప్పక నెర వేరవచ్చును

చంద్ర— త్రిశంక్వాత్మజా! నాయందింకను నీకునమ్మకముజిక్క లేదా సంశయార్థముగా బల్కుచుంటివి

గీ॥ సర్వమునుగాంచు నట్టిభాస్కరుని సాక్షి
చల్లదనమిచ్చుచుండెడు చంద్రుసాక్షి

ఫాలలోచనుసాక్షి యా వజ్రిసాక్షి
వినుము నినుదప్ప నన్యులబెండ్లియాడ॥

మాతండ్రిగారి దగ్గరకు వచ్చియడుగుటకు నీకంతభయముగాదోచిన నేనుబోయి యెట్లో బ్రతిమాలి యొప్పించి నిన్నే యచటకుబిల్పించు కొనెదను. అంతదనుక నీవీవనమునందే యుండుము

[ఆకాశమున]

హరిశ్చంద్రా? యీసతీమణిపల్కులు సత్యములు

హరి— [తనలో] ఆహా? ఈసతీమణిపల్కులు సత్యములని యాకాశవాణియే బల్కుచున్నదే

పుష్ప— అమ్మా? చంద్రమతీ? యిదివరకే గృహంబున కరుగుదము రమ్మనినన్ను తొందరించితివిగదా ఇంకను నాలస్యమొనర్చెద వేమి?

చంద్ర— ఆలస్యమేమియులేదు ఇదిగోవచ్చుచుంటిని (తనలో) అకటా యీపాడుమూండ నన్నుతొందర పెట్టుచున్నది ఈ మహానుభావుని వదలిపోవుటకు నామనంబెటుల సహింపగలదు కానిమ్ము ఎప్పటికైన బ్రాప్తమున్నవో మరల నీతనిసందర్శింపకుందునా (ప్రకాశముగా) పురుషాగ్రగణ్యా? నాకికశెలవొసంగుము.

హరి— పోయిరమ్ము యెట్లయినా కార్యసాఫల్యమొనర్చుము

చంద్ర— చిత్తము [పుష్పవేణివంకజూచి] చెలీయికబోవుదముపద

(తిరిగిచూచుచు చెలితో నిష్క్రమించుచున్నది)

హరి— ఆహా? ఆకాంతారత్నము నిష్క్రమించుచున్నదే యేమి నాయదృష్టహీనత ఇంకను కొంత తడ ఇచటనే యున్న యడల యేమని ముచ్చటించ గలుగునోగదా మరల నాసుందరాంగిని గాంచుభాగ్యమెప్పటికి లభింపనున్నదో తెలియదు. [ముందునకు జూచుచు]

ఉ॥ మెల్లగ నడ్గులేయుచును మేనుచలించగ వాలుచూపుతో
నెల్లదిశల్ గనుంగొనుచు నీవనరాజము నట్టుదాటుచున్
ఫుల్లసరోరుహాక్షి యిటు మోమునుద్రిప్పుచు నన్నుజూచు చా
వల్లనబోవుచుండె చనుబంతులు త్రైకను నాట్యమాడగన్॥

(తెరలో)

హరిశ్చంద్రా, హరిశ్చంద్రా

హరి— (ఆలకించి) ఎవ్వరిదా కంఠస్వరము మిత్రుండగు సత్యకీర్తి దా యేమి

సత్య— (ప్రవేశించి) ఆహా? యీతండేదియో విచారమునముసింగినట్లు దోచుచున్నది కాకున్న యీతని ముఖపద్మంబిట్లు వాడియుండుటకు కారణమేమి. (ప్రకాశముగా) మిత్రమా? యేదియో దీర్ఘాలోచన జేయుచుంటి వేమి.

హరి— సత్యకీర్తి? నేను నీవద్దనుండియట్లు బెబ్బులిన్ దరమకొని యీ వంకకరుదెంచి, దానినివధించి, పిమ్మట నొకసుందరాంగిని గాంచితిని ఆహా దానిసౌందర్య మెంతయని చెప్పవచ్చును.

సత్య— (తనలో) ఈతనికా స్త్రీ పిశాచముసోకినట్లున్నది కనుకనె యిట్లు తత్తరమందుచున్నాడు. (ప్రకాశముగా) హరిశ్చంద్రా యాబోటి యంతటిరూపసియా

హరి— చెప్పెదవినుము

ఉ॥ పున్నమనాటి చందురునిబోలుముఖంబు, ఫణీంద్రవేణి, వా
ల్గన్నులు తెల్లతామరలు, కాంచనకాంతిని మించుదేహమున్
జన్నులుపూలచెండ్లు, కడుచక్కని చెక్కులుగల్గియుండె నా
కన్నియకున్ సమానముగు కాంతనుగానజగత్త్రయంబునన్॥

మరియు

గీ॥ నడకగాంచిన రాయంచ నడకబోలు
పల్కులనువిన్న తేనెల జిల్కుచుండు
చక్కదనమెన్న రంభాది సఖులమించు
నారయూలేమ, యెవ్వని కబ్బగలదొ

సత్య— ఇంతకు మీ యిరువురకు మాటలు గలిసినవా?

హరి— మాటలుగలయుటే కాదు. చాల నాటకమే జరిగినది. (ప్రొద్దు వంకజూచి) అదిగో, భానుడస్త్రాద్రి కేగుచున్నాడు. ఇక మన సేనకడకరిగి యచట విశ్రాంతిగా జెప్పెదరమ్ము.

సత్య— సరే పోవుదముపద (ఇరువురు నిష్క్రమించుచున్నారు)

(తెర వ్రాలును)

ఇది తృతీయాంకము.





శ్రీ

# చంద్రమతీపరిణయము.

## చతుర్థాంకము.



రంగము — సౌధప్రాగ్ద్వారము

(చంద్రమతి యొంటరిగా ప్రవేశించుచున్నది)

చంద్రి — (తనలో హరిశ్చంద్రు నుద్దేశించి) హా త్రిశంక్వాత్మజా, హా హరిశ్చంద్ర నాఁడరణ్యంబున నీ నవమోహనాకారము ను గాంచి నదాది నాహృదయము నీస్వాధీనమై యిట్లుపరితపించుచుంటిని. అయ్యో నాఁడే నీవు దరిజేరి కరంబు బట్టవచ్చినప్పుడు సమ్మతించక నిన్నమితముగా దూషించితినిగదా నేనెంతమందమతిని నీవంటి పుణ్యపురుషుండు నావంటియదృష్టహీనకెట్లు లభించును

మ॥ వనితారత్నము నీకునై యిటుల భావంబందు నెల్లప్పుడున్
ఘనసంతాపము నొందుచున్నదని వక్కాణించువారేరి నిన్
గని, యెవ్వారిని వేడగాగలను యింక న్నాకు దిక్కేడి, మో
హనమూర్తిన్ నిను కన్నులారగను భాగ్యంబున్నదో లేదో యో

పురుషాగ్రగణ్యా? అనేక రాజకుమారులగాంచి చలించని నాహృదయంబరణ్యమున నీ సుందరవిగ్రహ సందర్శనము సోకినంత మాత్రమునసే చలించి నీస్వాధీనమైనది. నిన్ను వైవాహికంబాడకున్న నామేని

యందు ప్రాణవాయువులు నిల్చునా! నేను చెలితో తిరిగి గృహంబునకు వచ్చునపుడు నాపై బ్రచురింపజేసిన నీ చూపులెట్లు మరువగలను (ఇంచుకయూరకుండి) అకటా నీవిపుడేమి చేయుచుంటివో గదా. నీయుదంతము నాకు దెల్పువారెవ్వరు? నిన్ను దూషించినందులకు నాపై నలుకవహించియుంటివేమో. నాతప్పు క్షమించుమురుగాత

మ॥ స్థిరబుద్ధిన్ భవదీయ పాదములు హృత్పీఠంబునన్ నిల్పి యీ
సరణి న్వాక్సుమరాశితోడను యభీష్టావాప్తినాశించి, యే
మరకే పూజలొనర్చుచుంటిని గృపన్ బాలింపగా జూడుమీ
తరుణిన్, నిన్నెదనమ్మినట్టి గరితన్ ధాత్రీపతీ నందనా

సీ॥ సుందరాకారనీ యందంబుగనలేని
కమలదళాక్షి వాల్గన్నులేల
కారుణ్యశీలనిన్ గాగలింపగలేని
కాంతులదొంతి చన్బంతులేల
యువరాజ నీప్రక్క బవళింపగాలేని
తరుణీశిరోమణి తనువదేల
సజ్జనస్తుతనీతొ స్మరుకేళిదేలని
కన్నియ యౌవన గరిమమేల

గీ॥ సఖుడ నీతోడ మాటాడ జాలనట్టి
మగువ వాక్శుద్ధియేల జన్మంబదేల
తరణి వంశజనీవు నాకరముబట్టు
భాగ్యమే గల్గకున్న నాబ్రతుకదేల

అమ్మో నీ నామమును దలంచినంతనే మీనకేతనుడు నాపై పుష్పశరవర్షము గురిపించుచున్నాడే (మన్మధునుద్దేశించి) రతిపతీ

గీ॥ సతిపతుల చెంతకున్ జేరి శౌర్యమెసగ
పువ్వుటమ్ములు జిమ్మంగ బోలుగాని
వర హరిశ్చంద్రు భర్తగా బడయగోరి
యున్న ననుగాసి సేయంగ నోర్వగలనె

ఆతండు నామనోవల్లభుండగునంతవరకు నీశరవర్షమాపుము(ఇంచుక యూరకుండి) నేనిప్పుడిట్లు జింతించుచున్న ప్రయోజనమేమిగలదు! నా మనంబు మున్మాటికా హరిశ్చంద్రునియందే జిక్కియున్నది. నేనతని దప్ప నన్యుల వరించనని మాతండ్రిగారికి విన్నవించినయెడల, ఆయన గారు నన్నా హరిశ్చంద్రునకేయిచ్చి కల్యాణోత్సవము జరుపును. ఇందుల కన్యథా జరుగునేని

చ॥ గరళముగ్రోలి చచ్చుటయొ, ఖడ్గముచేకొని కుత్తుకన్ వడిన్
నరుకుకొనంగబూనుటొ, ఘనంబగు వార్ధులలోన దూకుటో
నురికి ప్రయత్నమొందుటొ, మహోగ్రదవానలమందుజొచ్చుటో
జరుగును, వేయుసార్లకిది సత్యము, సత్యము, సత్యమిద్ధరన్

(తెరలో)

అమ్మా మీతండ్రిగారు దయచేయుచున్నారు

చంద్ర— [తనలో] అకటా? మాతండ్రిగారిచటికే వచ్చుచున్నాడు. ఆయనగారితో నాకోర్కె నెట్లుజెప్పగలను

(పిమ్మట మయబ్రహ్మ ప్రవేశించుచున్నాడు)

మయ— [తనలో] ఆహా? నాముద్దులపట్టి వసించు గృహాంబినాడింత కళాహీనముగా నుండుటకు కారణమేమైయుండవచ్చునో (దివ్య దృష్టింజూచి) ఆ తెలిసినది తెలిసినది. అయినసీసంగతిముందుగా

నేనే వెల్లడించుట సమంజసముగాదు. నాతనూజ నోట నుండియే బయల్పడవలెను (సమీపించుచున్నాడు)

చంద్ర— జనకా? నమస్కారము

మయ— "శ్రీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు"

చంద్ర— నాన్నగారూ? యీచింతామణిపీఠ మలంకరించుడు

మయ— (కూర్చొని చంద్రమతి ముఖము దిలకించి) పట్టీ నీమొఖబిం బము నేడేలనో చిన్నబోయినట్లున్న దేమి

చంద్ర— (మాట్లాడక యిన్నకుండును)

మయ— అమ్మా మారుబల్కక దీనవదనారవిందవై వంతకు లోబడు చుంటివేల. నీమదింగల కోర్కెలెట్టివో వచింపుము. తప్పక నెరవేర్చెద. కాకున్న

సీ॥ సాటి మునిసుతలు చౌకయొనర్చిరో
చెప్పుమిప్పుడె వారి శిక్షచేతు
పరిచారికల్ నిన్ను నిరసించగల్గిరో
నుడుము వారి రూపడగ జేతు
వితరులు నిన్ గాంచి హేళనసల్పిరో
దెల్పుము వారి బూదిగను జేతు
చేడియల్ నీయాజ్ఞ సేయకనుండిరో
సరగబల్కుము వారి సమయజేతు

గీ॥ గాక నాభరణములపై కాంక్షగలదొ
చీనిచీనాంబరంబులపైన భ్రాంతి
యున్నదో దగ వచియింపు మెన్నిమైన
గూర్తు చింతించ నేలను కూర్మిపట్టి॥

చంద్ర— తండ్రీ? నాకందరనుకూలముగానే చరించుచుండిరి. ఆభర ణాదులపైఁగూడ నాకిచ్ఛలేదు.

మయ— అక్కయ్య యేమైన నన్నదా?

చంద్ర— లేదు

మయ— నేనెప్పుడైన నేమైన నంటినా?

చంద్ర— అనలేదు.

మయ— (కోపముతో) కాకున్న నా తపోమహిమంబునకు చతురా నన, పంచానన, షడానన, సహస్రానన, వజ్రాయుధ, శూలా యుధ, సిద్ధ, సాధ్య, యక్ష, కిన్నర, కింపురుష, గరు, డోరగ, విద్యాధరాద్యఖిల సమూహంబులు గడగడ లాడుచుండ నా తనూజవైన నీకపకార మొనర్చిన దురితాత్ముడెవ్వడు?

చంద్ర— (తనలో) ఆహా? నా సంతాపమునుజూచి మా తండ్రిగారి కోపాగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుచున్నవే. ఇంతకు మితిమీరిన చో జగత్ప్రళయము సంభవించుటకు సందియముండబోదు. కనుక నీ సమయమున మెల్లగా నా కోర్కెను వెల్లడించెద (ప్రకాశ ముగా) తండ్రీ, నేటికైదు దినములక్రిందట నేను చెలికత్తెయగు పుష్పవేణితో గలసి విహారార్థమై వనంబున కేగితిని.

మయ— పిగిన నేమయ్యెను?

చంద్ర— జనకా, నీతో వచించుటకు భయముగా నున్నది.

మయ— అమ్మా భయమేమియు లేదు చెప్పుము. నీమదిం గల కోర్కె లు నీతండ్రినైన నా కెరింగించక మెవరితో జెప్పుకొనగలవు.

చంద్ర— ఆవనమునందు

సీ॥ పూర్ణసుధాకరున్ బోలు ముఖమువాని
తమ్మిపూలగేరు నేత్రములవాని
చక్కనై కనుపట్టు సమభుజంబులవాని
చిరునవ్వు మోమున జిల్కువాని
పసిడిచాయను గేలిపరచు దేహమువాని
స్మరుని గద్దియనేలు యురమువాని
పురుషసింహులం డనబొల్చు శౌర్యమువాని
కరుణాంతరంగుడై గ్రాలువాని

గీ॥ విల్లు, శరములు, కరముల వెలయువాని
నరయ నిరువదియేండ్ల ప్రాయంపువాని
వర హరిశ్చంద్రుడను పేర బరగువాని
క్షితిత లేశ్వర సుతుని గాంచితినితండ్రి

మయ— కాంచితివి, కాంచిన నేమి

చంద్ర— ఆతండు నా దరిం జేరి, ముద్దుగుమ్మా, చిల్కలకొల్కి, చంద్రవదనా, శతపత్రేక్షణా, చందనగంధీయని పిల్చుచు యొక్కసారి నాయభీష్ట మీ·డేర్చి యీ మదనుని గర్వ మడంచుమని నన్ను పలువిధముల బ్రతిమాలెను· అంతట నేను "హరిశ్చంద్రా? యేకాంతమందున్న స్త్రీలతో నీవిట్లు బల్కుట భావ్యముగాదు నాపైననే నీకంత మోహమున్న యెడల మాతండ్రిగారి నడిగి నన్ను భార్యగా గ్రహించ"మని చెప్పి చెలితో తిరిగి గృహంబునకువచ్చితిని. వచ్చితినేగాని, వచ్చిన దాది నాహృదయమా రాకుమారుని స్వాధీనమైనది. అతనిదప్ప నన్యుల వరించుటకు నామనంబు సమ్మతించదు, గనుక నన్నాతని కొసంగి కల్యా

ణోత్సవము జరుపుము. తండ్రీ నీయెదుట నింత నిర్భయముగా బల్కుచున్న నన్ను క్షమించుము.

మయ— [తనలో] అదిగో, నేననుకున్నట్లే జరిగినది. [ప్రకాశముగా] అమ్మా నేనిదివరకే నిన్నా రాకుమారున కొసంగి కల్యాణోత్సవము జరుపదలచితిని. నాతలంపున కనుకూలముగ నీవు గూడ నాతని నేకోరితివి. ఆ త్రిశంకునిపట్టి సామాన్యమానవుడు గాడు. అనన్య సత్యనిష్ఠాగరిష్ఠుడు. పూర్వజన్మ సుకృతము మంచిదగుటచేతనే యట్టి వాడు నీకు భర్తగా లభింపబోవుచున్నాడు. తప్పకమీయిరువురకు వైవాహికస్ఫురణంబొనర్చెద నింకులకై విచారింపకుము.

చంద్ర— చిత్తము

మయ— ఇప్పుడాతడు వనంబుననుండెనా, గృహంబున కరిగెనా?

చంద్ర— వనంబుననే యుండెను

మయ— అట్లయినచో యారాకుమారు నిచటికేబిల్పించెద (ప్రక్కకు జూచి) వరేశిష్యా? దామోదరా

దామో— అయ్యా యేమి సెలవు

మయ— మనచంద్రమతి విహరించువనంబున హరిశ్చంద్రుడున్నాడట వానిని నాకడకు దోడ్కొనిరమ్ము

దామో— చిత్తము (నిష్క్రమించుచున్నాడు)

మయ— అమ్మా హరిశ్చంద్రు డిచటికి వచ్చినవెనుక నీ వివాహవిషయమునుగూర్చి ముచ్చటించుదము. నా కనుష్టానమునకు వేళయగుచున్నది. నే నేగుచున్నాడ. నీవిక లోనికరుగుము (నిష్క్రమించుచున్నాడు)

చంద్ర— ఆహా నాకిప్పుడు గల్గుచున్న సంతోషమునకు మేరలే కున్నది. ఎప్పటికైన "ప్రాప్తమున్నచోట ఫలమేలదప్పు" ననెడు వాక్యంబునకు భిన్నంబుగలదా. నామనఃపద్మభృంగి యగు హరిశ్చంద్రుడు వచ్చువరకు నేను మణిమయ భూషణా లంకారములతో నుండెద (నిష్క్రమించుచున్నది)

(తెరప్రాలును)

---

రంగము—వనభూమి

[హరిశ్చంద్ర డొంటరిగా ప్రవేశించుచున్నాడు]

హరి— అహ్హో? నాచిత్తమెంత మరల్చుదమన్న నాచంద్రమతి పైకే లాగుచున్నది. ఆవిషయమును మరచిపోవుదమని బ్రయత్నించినను మరపునకు రాకున్నది. ఎల్లపుడా చంద్రమతి నా కన్నులకు గట్టినట్లేయున్నది. అట్టి సౌందర్యగణిక నిక నెంద్రైన గాంచుట తటస్థించునా? ఏమా సౌందర్యాతిశయము

తే॥గీ॥ కలికి వదనంబు హిమధాము కాంతినించు
సఖియ దేహంబు బంగారు చాయనుండు
కాంత చెక్కిళ్లు గనగ పాల్గారుచుండు
వనిత మొగమున చిరునవ్వు వదలకుండు॥

సీ॥ తరళాక్షి నునుమోవి కొరికినప్పుడుగదా
యెంతమో నా వంటి కింపుగల్గు
గరిత పొక్కిలిసారు నరసినప్పుడుగదా
యెంతమో నాకంటి కింపుగల్గు

సతివ చన్నుంతుల నదిమినప్పుడుగదా
మొంతయో నాచేతి కింపుగల్గు
సుదతి శరీరంబు సోకినప్పుడుగదా
యెంతయో నామేని కింపుగల్గు
గీ॥ వెలదిలే నవ్వు దిలకించు వేళనుగద
యెంచ నామది కెంతయో యింపుగల్గు
వేయుపల్కులికేల నా విద్రుమోష్ఠి
యిప్పు డసుదెంచి పల్కిన నింపెగల్గు

నేటికాచంద్రవదన నన్ను వదలిపోయి అయిదు దినములు గావచ్చినది. కాని నాకుమాత్రమా యైదుదినంబు లైదు యుగంబులుగా నే జరుగుచున్నవి. మరల నాపద్మగంధిని గాంచుటెప్పుడాయని నాహృదయము తొందరపడుచున్నది. హృదయమా? ఏలనీకీవెఱ్ఱి కొన్ని దినములవరకు నోపిక వహించుము (చంద్రమతి నుద్దేశించి) ఓకాంతా రత్నమా

శా॥ ఆహా రేయుబవళ్లు నీకొఱకు నిట్లల్లాడుచున్నాడ, నే
యూహన్ జేయుదమన్నగాని మదియందుత్సాహమేలేదు, నీ
దేహప్రౌఢ విలాసముల్ గనియు తృప్తిం బొందుటేనాడో, నన్
మోహాబ్ధిన్ బడవైచిపోతివిగదా పూర్ణేందు బింబాననా

నన్ను గృహంబున కరుగకుండగూడ జేసిపోయితివే. నీకొఱకై నింతవరకు గనిపెట్టుకొని యున్నాడ. నాకొఱకై మాతలిదండ్రు లచట నెంత విచారించుచుండిరోగదా. అన్నులమిన్నా

ఉ॥ ఎప్పుడునన్ గ్రహించెదవొ, యెప్పుడునాకుముదంబుగూర్తువో,
యెప్పుడు పాన్పుజేరెదవొ, యెప్పుడుమోమునమోము జేర్తువో

యెప్పుడు కౌగలించెదవో, యెప్పుడు మారుని కేళి దేల్తువో
యిప్పుడు మారుబాధకు సహించకనుంటిని కామినీమణీ

త్వరగా నన్ను చేపట్టి యీ మదనుని గర్వమడంచుము (ఇంచుక యూరకుండి) అబ్బా? మారునకు నేనిపుడెంత చుల్కనైతిని. నీనామమును దలంచినకొలది నాపై పుష్పబాణమ్ములు విధివిరామము లేక గుప్పుచున్నాడే (మన్మథునుద్దేశించి) ఓయి మన్మధా? నీవు పరాత్పరుండగు పుండరీకాక్షుని గర్భమున నుద్భవించితివిగాని, యుద్భవించవలసిన వాడవుకావు. నీవిట్టి దుష్కృత్యము లొనర్చుచుండుటవలననే తొల్లి నిన్నొకమారు చంద్రశేఖరుడు తన ఫాలనేత్రాగ్నికణంబుల భస్మముగావించినాడు. కాని నీ సతీమణియగు రతీదేవి మాంగల్య ప్రభావముచే మరల ప్రాణంబులు బడయగల్గితివి. నీకట్టి ప్రాయశ్చిత్తము గల్గినను నీపొగరుమాత్రము చావలేదు. వేముజచ్చినను చేదు జావదను సామెత యిట్టిదే. ఇంకను నీకన్నివిధముల సరిగానున్న లోకంబును దక్కనిత్తువా. నిన్నునను, నీప్రతాపంబునుబట్టపగ్గంబులుండునా. నీసంగతెరుగనివారెవరు దుష్టా?

సీ॥ చే ధరించెడువిల్లు చెఱకుతుంటయెకాని
వీక్షించ ఘనమైన విల్లుగాదు
అస్త్రముల్ సిగదాల్చునట్టి సుమములెగా
నరుల భంజించు యస్త్రాళిగాదు
వాహనంబెన్నగ నరచిల్కయేకాని
జవసత్వమైన యశ్వంబుగాదు
పనియున్న జనులకు వలపుబెంచుటెకాని
సమరంబొనర్చెడు శక్తిగాదు

గీ॥ యింతమాత్రంబునకు మదినెంతొ గర్వ
మూని, శూరుండనంచును పొంచిపొంచి
విరిశరంబులు నాపైని బరపుచుంటి
వహహా, యికజాలు నీను శౌర్యంబుదెలిసె॥

ఆ చంద్రవదన నాకు భార్యగా లభించినవెనుక నీ శూరత్వమెంత వరకైన జూపుము. అప్పుడు నీకు సమాధానము జెప్పెద

(పిమ్మట సత్యకీర్తి ప్రవేశించుచున్నాడు)

సత్య—— [తనలో] ఆహా! యీతండు మొన్న నీవనంబున విహరించి చనిన మోహనాంగిని గాంచినప్పటినుండియు, పిలచినను సరిగా బలుకక, యొకచోట నిల్వక పిచ్చియెత్తినవానివలె దిరుగుచు నెప్పుడుజూచిన నేదియో దీర్ఘాలోచన జేయుచునే యుండును. ఇప్పుడీతని ముఖకాంతిన్ దిలకించగా మన్మథబాధకు సహించ కున్నట్లుదోచుచున్నది. (సమీపించి) మిత్రమా, హరిశ్చంద్రా? పరకాంతయనిన కన్నెత్తియైన జూడని నీకీ స్త్రీ వ్యసనమేల, వచ్చినపని నేదియో జక్కబెట్టుకొని త్వరగా గృహంబునకరుగక, నెవ్వరినో యొక కాంతామణిన్ జూచి భ్రమపడుచుంటివే. ఆమెవచ్చి నిక్కముగా నిన్నే వరించునని నమ్మకమెట్లు. నీకుగల్గిన యీచింత నీమనసును వ్యాకుల మొందజేయుటయేగాక, బుద్ధిని జెరచుటకుగూడ హేతువగును.

హరి—— మిత్రమా? సత్యకీర్తి, వచ్చితివా? అకటా యిప్పుడున్న నాస్థితి నీతో నేమివచించుదును

గీ॥ ఘోర సంగ్రామముఖమున వైరి బలపు
నస్త్ర సంతతికిన్ భయమందగాని

చెఱకు విల్కాఁడు దయలేక బఱపుచున్న
యస్త్రములుజూచి నే భయమందుచుంటి॥

సత్య— చాలుచాలు, నింతియేనా నీ ధైర్యసాహసములు. ఒజ్జల పాద సేవ రేయుంబవళ్లుజేసి సకల శాస్త్రార్థములనెల్ల గ్రహించినట్టి వాడవే. నీవేమన్మథబాఁటకి సహించనప్పుడు తక్కినవారి విషయ మెట్లుండును. మాబోటి మూర్ఖుల కనేకులకు నీతులు బోధించ దగినవాడవు. నీకు దెలియని విషయమేమున్నది. నీబోటి ధైర్య శాలి కుండఁదగలసిన లక్షణములా యివి. సరిగా యోచించు కొనుము

హరి— మిత్రమా, యోచించుటకేమిగాని యామె సామాన్య స్త్రీ గాదు.

సత్య— ఔను, ఆమె విషయమై నాకిదివరకే చెప్పియుంటివి. కాని యామెకు నీపైననే భ్రాంతి యున్నయెడల, నిన్ను వదలిపోయి నేటికైదు దినములు గడచినవిగదా యింతవరకు నిన్నుచటికేల బిల్పించుకొనకుండును? ఎందులకు నీకీవెఱ్ఱి. ఆమె నీసంగతి గృహంబున కరుగగనే మరచినదని నాయూహ

హరి— కాదుకాదు. అట్లెన్నటికిని జరుగబోదు. ఆ కాంతారత్నము నకు నన్ను వరించుట కిష్టము లేకున్నయెడల నామెపై నా దృష్టి బారనేపారదు. ఆ యిందువదన సౌందర్యాతిశయము విననమాత్రమున నీకేమి దెలియును. చూచినవాడనగుటచే నాకు దెలియును

సత్య— సరే, తొందరపడనేల. మీయిరువురకా పరమేష్ఠి దాంపత్య మునుగూర్చి లిఖించియున్నచో, యట్లేజరుగును.

హరి— (ఇంసుకయూరకుండి) మిత్రమా!

తే॥గీ॥ ఆమె సౌందర్యగరిమంబు నామెనడక
 యామె వినయంబు, గుణములు, నామెకులుకు
 నామె మృదుమధురోక్తులు నామె సొంపు
 మరచిపోవుదమనుకొన్నను మరపురావు

సత్య— మనసున నాటుకొనిపోయినవి మరపున కెట్లురాగలవు.

హరి— ఔను మిత్రమా! నీపలుకులు సత్యములు

(తెరలో)

అయ్యా హరిశ్చంద్రుడెందున్నవాడు

హరి— ఎవరా పిలుచువారు, మిత్రమా ఎవరో చూడుము

సత్య— (చూచి) ఇదిగో, ఎవడో మన దెసకే వచ్చుచున్నాడు.

హరి:—మాతండ్రిగారేమైన మనకొరకు దూతను బంపెనా యేమి ?

సత్య:— కాదు కాదు. ఈత డెవడో ముని శిష్యుని బోలియున్నాడు.

( పిమ్మట దామోదరుడు ప్రవేశించుచున్నాడు )

దామో—అయ్యలారా ? మీాయిరువురలో హరిశ్చంద్రుడెవరు.

సత్య—ఇదిగో యీా పుణ్యపురుషుడే హరిశ్చంద్రుడు. కాని యితని తో నేమిపని ?

దామో—మా గురువుగారు దోడ్కొని రమ్మనిరి.

సత్య—మీాగురు వెవరు

దామో—మయ బ్రహ్మ

సత్య—ఎందులకో కారణ మరయవచ్చునా ?

దామో—ఎమో నాకు తెలియదు.

హరి— అయ్యా నీనామమేమి.

దామో — దామోదరుడు.

హరి—(సత్యకీర్తివంకజూచు] మిత్రమా।

గీ॥ ఇతను రాకకు కారణంబేమొ తోచ
దయ్యె, కుడికన్ను మాత్రము యదరుచుండె
నెట్టి శుభమొనగూడునో యికనుముందు
దీని ఫలము వచింపుము ధీవరేణ్య

సత్య — హరిశ్చంద్రా? ఫలమువచించుటేమున్నది నీరొట్టెజారి నేతిలో బడినది.

హరి— [సంతోషముతో] సత్యకీర్తి? నిశ్చయమా

సత్య— ఆ, ముమ్మాటికి నిశ్చయమే

హరి— (తనలో) ఆహా? నేనిప్పటికిగదా ధన్యుండనైతిని. అయినను చంద్రమతి పల్కులు సత్యములని యాకాశవాణియే ముందు నాకు సాక్ష్యమిచ్చెదను గదా. నాకిట్టివాదమొందులకు (ప్రకాశముగ) సత్యకీర్తి యికమునీంద్రునికడకరుగుదముపద. దామోదరా నడువుము. (హరి,సత్య,దామో,నిష్క్రమించుచున్నారు)

(తెరవాలును)

రంగము — మయుని యాశ్రమము.

(మయుఁబ్రహ్మ కూర్చొనియుండగా హరిశ్చంద్ర, దామోదర, సత్యకీర్తులు ప్రవేశించుచున్నారు)

హరి— (మయునివంకజూచి) మునిచంద్రోత్తమా? భవత్పాద పద్మంబులకు నమస్కరించుచున్నాడ.

మయ— వత్సా? త్వరలో కల్యాణము సిద్ధించుగాక

సత్య— తాపసేంద్రా? నమస్కారము

మయ— సుఖీభవ, సుఖీభవ

హరి— మహాత్మా? తమ దివ్యమంగళ విగ్రహసందర్శనము సోకుటచే గృతార్థులమైతిమి

మయ— (హరిశ్చంద్రునివంకజూచి)

ఉ॥ సేమమె తల్లిదండ్రులకు, సేమమె బంధుజనాళికిన్ సదా
సేమమె మిత్రసంతతికి సేమమె యొజ్జల కెల్లవేళలన్
సేమమె జంతుజాలములు సేమమె భవ్యవన ప్రశిష్యలున్
సేమమె రాష్ట్రమంతట వచింపుమూ వేగ త్రిశంకునందనా

హరి— అయ్యా తమ యాశీర్వచనబలంబున నందరకు కుశలమే కాని నన్నిటకు బిల్పించిన కారణమేమో సెలవీయ బ్రార్థించెద

మయ— తెల్పెదవినుము

చ॥ స్థిరతరధీవిశాల, గుణశేఖర, రాజలలామపుత్ర, నా
వరసుతయైన చంద్రమతి స్వాంతము సందున నిన్నుదప్ప నొం
డొరుల వరించనంచని మహోగ్రప్రతిజ్ఞ వహించెగాన నా
గరితను వేడ్కమీర సతిగా గ్రహించుము సౌమ్యులెన్నగన్

హరి— చిత్తము

మయ— త్రిశంక్వాత్మజా, నీసత్య శాంత శమదమాది గుణంబుల నే నిదివరకే గ్రహించి నాతనూజను నీకొసంగి వివాహంబు జేయ దలంచితిని. అది యట్టులుండ నాపట్టిగూడ నిన్నే కోరినది. నీకుగూడ నామెపైననే మోహమున్నదని నాయభిప్రాయము

హరి— చిత్తము. మహా తపఃప్రభావులగు తమకు దెలియనివిషయ మేమున్నది

మయ— సత్యకీర్తీ? మన చంద్రమతీ హరిశ్చంద్రులు సతిపతులగుట నీకిష్టమేనా!

సత్య— మహాత్మా!

గీ॥ నిత్యసత్యవ్రతుండయి నెగడువాని
కమితగుణశీలయైన యిల్లాలుగల్లు
చుండ, కాదనువారలీ యుర్వియందు
గలరె యోచించిచూడగ లలితచరిత

మయ— సరే, హరిశ్చంద్రా! నాకనుష్ఠానమునకు వేళమించుచున్నది. నీవిప్పుడు పురంబునకరిగి, మీతండ్రిగారితో "ఏతత్సంవత్సర మాఘబహుళ పంచమీ స్వాతి నక్షత్ర మేషలగ్నంబున వైవాహికం"బని చెప్పి, యా సుముహూర్తంబునాటికి చతుర్వర్ణబంధుజన పరివార సమేతంబుగా నాయాశ్రమమునకు రండు. ఇక నే నేగుచున్నాడ

(దామోదరునితో మయబ్రహ్మ నిష్క్రమించుచున్నాడు)

హరి— మిత్రమా వింటివా మునిచంద్రునిపల్కులు

సత్య— వేయేల హరిశ్చంద్రా? యీవిషయమున దైవము నీ కనుకూలుడై యున్నాడు (ఇంచుకయూరకుండి) కాని మనమీముచ్చటితో కాలముజరుపుచున్న, మీతండ్రిగార చట మనకొరకైయెంత విచారించుచుండిరో. యికవనంబుననున్న సేనందోడ్కొనిపురంబున కరుగుదముపద.

(హరిశ్చంద్ర, సత్యకీర్తులు, నిష్క్రమించుచున్నారు)

[తెరవ్రాలును]

ఇది చతుర్థాంకము



శ్రీ

# చంద్రమతీ పరిణయము.

## పంచమాంకము.



రంగము:— అయోధ్యాపురము

(విచారముతో త్రిశంకుడు ప్రవేశించుచున్నాడు)

త్రిశం— ఆహా? నాపుత్రరత్నంబగు హరిశ్చంద్రుడు శరభ, భల్లూక, వేదండ, వరాహ, ఖడ్గ, వ్యాఘ్రాది మృగరాజంబులు సంచరించు భయంకరారణ్యంబులకు బుద్ధిసాగరుడగు సత్యకీర్తి సమేతుడై వేటనిమిత్తమై చని నేటికి పక్షము రోజులు జరుగుచున్నవి. ఇంత వరకును గృహంబునకు రాని కారణమేమో తెలియదు. పోవునపుడు నాయనా నీవు త్వరగా గృహంబునకు రాకుంటివేని నా మేనియందు ప్రాణవాయువుల నిల్వజాలనని యనేక విధముల జెప్పితిని. ఆతండింతటి యాలస్యమొనర్చుట కచటేదియో వింత జరిగినట్లు దోచుచున్నది. కాకున్న నన్ను వదలి యిన్నిదినంబు లుండునా (ఇంచుకయోచించి) అకటా నేనెంతబుద్ధిహీనుడను ఘోరారణ్యంబులకు, కుమారుని వెంట నేనరుగక సత్యకీర్తిని బంపితినే. అయ్యో నేనేగినచో యింతటి విచారముండదుగదా.

కాని వేటకేగుటకు ముందునాముద్దులపట్టియగు హరిశ్చంద్రుడు నన్ను గాంచి తండ్రీ?

చ॥ వనములనుండు క్రూరమృగ వర్గములన్ వధియింప నేనిదే
జనిమెద మిత్రినిన్‌గలసి చయ్యన దీని కనుజ్ఞనీయవే
యనిన కుమారు వాక్యముల కద్భుతమందుచు పుత్రికోర్కెగా
దనుట ఘనంబుగాదనియు నట్టులె పొమ్మని సమ్మతించితిన్॥

పంపినవారిరువురా వనమృగ వినోదంబు లరయుచు నింతటి యాల స్యమొనర్చిరేమో లేక యేపట్టణంబునకైన జనిరో. యేంసూహా జేయు దమన్న నామనసున కగోచరముగ నున్నదే (భగవంతునుద్దేశించి) ఓ భగవానుడా, లక్ష్మీకళత్రా? మమ్ముల బరీక్షించుటకై యిట్టి యెడ బాటు గల్గించితివేమో నేనూహింపజాలకున్నాడ. నీవెంతటికైన సమ ర్థుండవగుదువు (కుమారు నుద్దేశించి) హా కుమారా

గీ॥ నీవు లేనట్టి మనయూరు నిక్కముగను
జందురుడు లేని రాత్రిరి చందమయ్యె
నింత తడవానరించుట నిదియు తగునె
తరణి కులరత్నదీప, శాంతస్వరూప॥

(తెరలో కలకలము)

ఆ కలకల మేమైయుండవచ్చును (ఆలకించుచున్నాడు)

[తెరలో]

నృపసార్వభౌమా, సత్యకీర్తిసమేతుడై బాబుగారుదయచేయుచున్నారు.

త్రిశం— (సంతోషముతో) ఆహా యిప్పుడుగదా సంతోషవార్త నా వీనులకు సోకినది

(పిమ్మట హరిశ్చంద్ర, సత్యకీర్తులు, ప్రవేశించుచున్నారు)

హరి— తండ్రీ, భవత్పుత్రుండిదే నమస్కరించుచున్నాడు.

త్రిశం— "చింతిత కల్యాణ సమృద్ధిరస్తు"

సత్య— నృపచంద్రా? వందనము

త్రిశం— సత్యకీర్తి? వర్ధిల్లుము

హరి— (తనలో) ఆహా తండ్రిగారుగూడ నా కోర్కె ననుసరించియే దీవించినాడు.

త్రిశం— (హరిశ్చంద్రుని మోము దిలకించి) నాయనా, హరిశ్చంద్రా మాట్లాడ దగిన విషయము లున్న రేపటిదినమున మాట్లాడ వచ్చునుగాని

చ॥ అడవుల సంచరించెదు మృగాళినిజంపుటచేత నీయొడ
ల్బడలిక జెందినట్లు ముఖపద్మము జెప్పుచునున్నదయ్య యి
ప్పుడె భవనంబుజేరి రసభోజన సౌఖ్యము లందుమయ్య నా
కడుపు దహించుచుండె నినుగాంచినదాదిగ భగ్గుభగ్గునన్॥

హరి— జనకా, కుమారునియందుండు వాత్సల్యముచే నిట్లు బల్కుచుంటిరి గాని తమతోనొకమనవి విన్నవించవలసియున్నది దాని నంగీకరించ బ్రార్థించుచున్నాడను.

త్రిశం— నాయనా, సందియమేల వచింపుము

హరి— చ॥ తమసెలవంది, యే నడవిదారులకేగి చరించుచుండ, చం
ద్రమతియనంగ నొక్కవనితామణిననే గనులారగాంచి మో
హముమదిహెచ్చగా తనగృహంబునకున్ జనితండ్రియై జెలం
గు, మయునితోవచించ, మునికుంజరుడంతట నన్ను బిల్వనం
పి, ముదముమీర నాసుతను బెండిలియాడుమటంచ నెన్ బితా॥

నే నందులకు సరేయని సమ్మతించి వచ్చితిని

త్రిశం— కుమారా, సంతోషము గల్గుచున్నదిగాని, నీసౌందర్యమున కున్ దగిన బాలామణి యెందైన నున్నదేమో విచారించిరండని మంత్రులను బంపగా వారన్నిదిక్కులు వెదకివచ్చిరి. కాని యట్టి కోడలు మాత్రము నాకెక్కడను లభింపదయ్యె. నిన్నా వనమధ్యమునగాంచి వరించిన చంద్రమతీ సౌందర్యమెట్లుండెనో నే జూడనైతినిగదా

హరి— తండ్రీ ? నీవు జూడనవసరము లేదు. ఆచంద్రమతి సౌందర్య మునకారంభ. ఐశ్వర్యమునకా లక్ష్మి. ఓర్పునకా భూదేవి. విద్య కా సరస్వతి. పల్కులకా చిల్క. నడకకా రాజ హంస. జనకా వేయేల నా మనంబు ముమ్మాటికా చంద్రవదనయందే జిక్కి యున్నది. ఆ సుందరాంగినిదప్ప నన్యకాంతల నైకొన నామనం బొల్లదు. అదిగాక మునీంద్రునియాజ్ఞ మీరినచో మహా కష్ట ములు జేకూరును.

సత్య— మహీపాలా? యీరోజులలో పిల్లకు పిల్లవానికి యిష్టమున్న వివాహము జేయుటయే మిక్కిలి శ్రేయస్కరము

త్రిశం— నాయనా, హరిశ్చంద్రా? అట్లయినచో నీవు గోరినట్లే వివా హము గావించెద. నీకిష్టమైనచో మాకెల్లర కిష్టమేయగును. ఇందులకై విచారింపకుము

(తెరలో)

రాజేంద్రా, వసిష్ఠమహర్షిగారు దయచేయుచున్నారు

త్రిశం— మహాభాగ్యము (ఎదురేగి) గురువరా నమస్కారము. దయ చేసి యీ రత్నపీఠంబు నలంకరించుడు

వసి— ఆయుష్మాన్‌భవా (అని కూర్చొనుచున్నాడు)
త్రిశం— చ॥ పరమగుణాఢ్య మీారిటకువచ్చుటచేత సఘంబుదూలె,మ
త్పురము బవిత్రమయ్యె, మది దుర్దశలెల్ల నశించిపోయె, మీా
చరణములన్ సుమంబులను జాలగ పూజలొనర్చు భాగ్యమే
దొరకె, సమస్త కోరికల దుష్టివహించితి నెంతొ ధన్యుడన్
హరి— సత్య— తపోధనా మావందనము లందుకొనుడు
వసి— సుకుమారులారా? వర్ధిల్లుడు
త్రిశం— గురువరా? కుమారుని వివాహవిషయమై ముచ్చటించుచుం
డగా తమరరుదెంచుటచే గృతార్థుండనైతిని
వసి— (ఆశ్చర్యముతో) ఎమీా? హరిశ్చంద్రుని వివాహమా? ఎట్లు
త్రిశం— నేటికి పక్షమురోజులక్రిందట మన హరిశ్చంద్రుడు సత్యకీర్తి
సమేతుడై వేటకొరకేగి వనభూములయందు సంచరించుచుండె
నట. అంతట మయబ్రహ్మ తనూజయగు చంద్రమతి యౌవన
మధ్యమున విహరించుచు, మన హరిశ్చందు్రిని గాంచి, మో
హంబు బెనగొన, తన గృహంబునకరిగి, తండ్రియగు మయు
నితో యీా వృత్తాంతమెల్ల వచించగా, నమ్మయచంద్రుండు మన
హరిశ్చంద్రుని బిల్పించి, రాకుమారా? నా కుమారీరత్నంబును
నీకొసంగి వివాహము జేయదలంచితిని, గాన నామెను భార్యగా
గ్రహించమనిచెప్ప,నందులకుమత్పుత్రుండు సమ్మతించివచ్చెను.
కాని యాచంద్రమతి మన హరిశ్చంద్రుని సుగుణంబులకు తగిన
సతియో, కాదో యని నాసందేహము
హరి— (తనలో) ఈ తాపసేంద్రుండేమైన నాటంకము జెప్పునాయేమి.
చిత్తమా? తొందరపడకుము

వసి— కుంభినీధవా? నీవెంతమాత్రము సందియమందవలదు. ఆకన్యా మణి నీకు కోడలగుటచేత, సూర్యవంశంబున కెన్నఁడవ కీర్తి చేకూరుటయేగాక, యామెమూలమున మనమెల్లరము గూడ కృతార్థులమగుట నిశ్చయము, నిస్సందేహము, నిర్ధారణము

త్రిశం— చిత్తము

సత్య— (హరిశ్చంద్రునితో రహస్యముగా) మిత్రమా, అదృష్టవంతుని జెరచువారెవరు

వసి— హరిశ్చంద్రా, దయామయుడగు నయుడు వివాహముహూర్తముని శ్చయించెనా, లేక మనలనే నిశ్చయించుకొనిరమ్మనెనా

నారి— ఆ మహానియుడే నిశ్చయించెను

వసి— ఎప్పుడు

హరి— ఏతత్సంవత్సర మాఘ బహుళ పంచమీ స్వాతీ నక్షత్ర మేష లగ్నంబున

వసి— (ఆలోచించి) అట్లయినచో యాశుభముహూర్తమిప్పటికి నాల్గు దినంబులుమాత్రమేగలవు. (త్రిశంకునివంకజూచి) మహీపాలా? వివాహముహూర్తము సమీపించుచున్నది. కాన నప్పటికి

తే॥గీ॥ మన పురంబునగల యట్టి జనులతోడ
సకల రథ, గజ, ఘోటక సమితితోడ
సరి ధరిత్రీశ పుత్ర శేఖరులతోడ
చనగవలయును జయజయ ధ్వనులతోడ

కావున నింతటితో సభ ముగించుదము

శం— చిత్తము (అందరు నిష్క్రమించుచున్నారు)

(తెరవాలును)

రంగము:— పురవీధి

(డప్పు వాయించుచు పింగళుడు ప్రవేశించుచున్నాడు)

పింగళుడు— ఓహోహో హోహో యినండి యినండి. సెప్పలేదనేరు. వినలేదనేరు. యిప్పుడు మీకందరుకు నేను బాగా సెప్పేదేందంటే రేపటిరోజున మనూరు పాలించు త్రిశంకమారాజుగారి కొమారుని పెల్లెంట. పెల్లికొడుకు పేరు అరిచ్చంద్రుడు. కామట్టి సిన్నా పెద్దా అందరు ఆయన పెల్లి కెల్లుటకు సిద్దంగుండాలిసిందర్రో హోయ్

అట్టు రానోల్లకు మన పెబువుగారు కటినచిక్ష యాత్తారంట. ఆలాఛలవయ్యింది. కనక అట్టి చిక్షబడకుండ, యేగామాలకి పోకుండ, యియ్యాలనుంచే జాగత్తలోనుండాలి సిందర్రోహోయ్

ఈయాల వూల్లో వాల్లెవ్వరు వన్నం వండుకోకుండా, యీవన్నమంది బోజనాలికి పెబువుగారి గువానికి రావలసిందర్రోహోయ్.

(డప్పువాయించుచు నిష్క్రమించుచున్నాడు)

తెరవ్రాలును

---

రంగము:— మయుని యాశ్రమము.

[మయబ్రహ్మ, దామోదర, త్రిశంక, హరిశ్చంద్ర, సత్యకీర్తి, వసిష్ఠ, విశ్రవసు, కశ్య, పాత్రి, భారద్వాజ, గౌతమాదులుప్రవేశించుచున్నారు]

వసి— త్రిశంకమహీపాలా? సత్యనిష్ఠాగరిష్ఠుండగు నీ కుమారునకు సుగుణవతియగు చంద్రమతిని వివాహము జేసికొని కీర్తిగనుము

త్రిశం— మహాభాగ్యము

మయు— (హరిశ్చంద్రుని వంకజూచి)

సీ॥ మనసార నినుగోరు వనితాశిరోమణిన్
బాలించుమోయి భూపాలపుత్రి
నీపాదపద్మముల్ నిత్యంబుపూజింప
జూచుకాంతనుగొమ్ము సుప్రకాశ
నినుదప్ప నితరులగని వరించనటంచు
బల్కు-కల్కి సిగాపు వరగుణాఢ్య
నీవెదైవమటంచు నెమ్మది నమ్మిన
సాధ్విపయోలుము సత్యమార్గ
గీ॥ త్వరగనరుదెంచి నీవునాకరముబట్టు
టెన్నడోయని వీక్షించుచున్నవి ద్రు
మోష్ఠి నిటమీద పెండ్లాడి యుచితరంపు
సౌఖ్యములదేలు మోయి రాజన్యలెన్న॥

వసి— (మయునివంకజూచి) ముఃనికులసార్వభౌమా?

శా॥ శ్రీకల్యాణగుణాస్పదుండు, కరుణాసింధుండు, మాన్యుండు, మా
రాకారుండు, నగేంద్రధైర్యుడు, జనాహ్లాదైకచిత్తుండు, నీ
కాకుత్స్థాన్వయ వార్ధిచంద్రుడు, భవత్కారుణ్యపాత్రుండునై
నీకూతున్ వరియించి ధర్మమిలపైనిల్పున్ గ్రమంబొప్పగన్॥

ఇందులకావంతయు సందియమువదవలదు.

త్రిశం— వసిష్ఠా? తపోధనుండవగు నీయమోఘాశీర్వచనమే ఫలించు
గాత.

మునులు— మయమహర్షి? మునిజన గరిష్ఠుండైన యీవసిష్ఠుని వాక్య
ములు నిక్కవములు.

మయ— మహాత్ములారా? యీహరిశ్చంద్రుని సత్యశాంత శమదమాది గుణంబుల నేనిదివరకే గ్రహించితినిగాని వివాహలగ్నముసమీపించుచున్నది. మనమిక లోనికేగుదము రండు.

(అందరు నిష్క్రమించుచున్నారు)

(తెరవ్రాలును)

---

రంగము:— వివాహ మండపము

[పసుపు వస్త్రములతో చంద్రమతీ హరిశ్చంద్రులు పెండ్లిపీటలపై కూర్చొనియుందురు. తక్కినవారిరుప్రక్కల నిల్చియుందురు. తెర లేచును]

మయ— అమ్మా చంద్రమతీ నీవులేచి యీ మునిచంద్రుల కందరకు నమస్కరింపుము.

చంద్రి— (అట్లు జేయుచున్నది)

మునులు— "దీర్ఘసుమంగలీభవ"

వసి— హరిశ్చంద్రా నీవుగూడ లేచి యీమునీంద్రులకునమస్కరింపుము

హరి— [అట్లు జేయుచున్నాడు]

మునులు— "శీఘ్రమేవ సంతాన ప్రాప్తిరస్తు"

మయ— మునిచంద్రులారా యీ కన్యామణి కాంపిల్యనగరం బేలు జయసేనమహారాజుపుత్రిక. ఈమె జననకాలము చెడ్డదనియు, ఋతుమతియైనకాలమంతకన్న దుష్టమనియు, నందువల్ల దండ్రికి ప్రాణహానిచేకూరుననియు, దానికిన్ దగిన శాంతియెద్దియు లేదనియు జ్యోతిష్కులు వచించగా కాంపిల్యాధిపతి మిక్కిలి భయమంది యీకన్యారత్నమునొక మందసమునందుంచి బ్రహ్మపుత్రానదీ

ప్రవాహంబున బడవేయించెను. ఈమె యామందసంబునందుండి దుఃఖించుచుండగా, నా యార్తధ్వని నాశ్రవణ గోచరమైనది. అంతనాశిష్యులన్ బంపి, మందసమును దెప్పించి తెరచి, యీ చిన్నదానిని బయటకుదీసి యోదార్చి నాబిడ్డవలె పోషించుచు ప్రథమపుత్రిక మండోదరియనియు, ద్వితీయపుత్రిక చంద్రమతి యనియు, భావించి ప్రేమతో బెంచి యీ సుముహూర్తకాలంబున మీమీపాదపంకేరుహములపై బడద్రోచితిని. మీరెల్లరు కరుణామయులై "దీర్ఘసుమంగలీత్వము గల్గుగాక" యని యాశీర్వదించితిరి. మీ వచస్సులు బ్రహ్మలిఖితములవంటివి. కనుక ధాతవ్రాతకు భిన్నంబులేదనియు, నాలాగునజరుగక తప్పదనియు నీవివాహముహూర్త కాలంబున వచించుచు.

(మును లం ద రు పై కి జూ చు చు న్నా రు)

అత్రిమహాముని:— (లేచి) తపోధనులారా? తొల్లి యవంతిపురంబున బురందరుండను నొక హాలికుండుగలడు. అతని కేడుగురు పుత్రికలుగల్గి పిమ్మట కొన్నిదినంబుల కొకపుత్రుడు గల్గెను. వానికి సకలైశ్వర్యములు గలవు. కాని యాకుమారుడుమాత్రి మతి మూఢుడు. అందువల్ల పురందరుడా బాలునకు "అష్టవక్త్రు డ"ను నామంబిడి, "అంబుజాక్షి "యను నొక సుందరాంగిని దెచ్చి వివాహము గావించి, తన పురంబున తానెక్కువకీర్తితో బ్రవర్తించుచుండెను. కోడలైన యంబుజాక్షి, తనప్రాణనాయకుండు నపుంసకుండని యెరింగి, పూర్వజన్మ దుష్కృత పరిపాకంబుచే నాకిట్టి మగడు బ్రాప్తించెనని యెంచి దుఃఖించుచు,

రొక నాడు బహిష్టయి స్నానమాచరించి, సకలాభరణముల ధరించి, పరిమళ ద్రవ్యంబుల నలందికొని, రెండవ జగన్మోహిని వలె మేడపై గూర్చొని బ్రకాశించుచుండె. అంతనా పురంబు పరిపాలించు చిత్రకేతుడను రాజు యావీధినిన్ బోవుచు, నంబు జాక్షింగాంచి, మోహావివశుడై, గృహంబున కేగి, మన్మథబారి కోర్వక, యంబుజాక్షి నాకెట్లులభించునాయని విచారించుచుండె. మేడపైనున్న యంబుజాక్షిగూడ రాజునుగాంచి మోహానిమగ్నయై, యారాజుతో సాంగత్యమెప్పుడు లభించునాయని విచారించుచు, చెలికత్తెతో తన మనోభిప్రాయమును దెల్పి దానినారాజుకడకు బంపెను. అది మొదలెప్పుడు సూర్యుడస్తమించునా, యెప్పుడు జిత్రకేతునితో సౌఖ్యమనుభవింతునా యని యువ్విళ్లూరుచుండ, కొంతతడవునకు బ్రొద్దు గ్రుంకెను. అంతట సకలాభరణ భూషితయై తురుమున మల్లెపువ్వుల తోరణంబులు దురుముకొని, తన యందమును నిల్వుటద్దమున దిలకించి, యారాత్రి యంబుజాక్షికొరకు నిరీక్షించుకొనియున్న చిత్రకేతునిన్ గూడి రతిసౌఖ్య మనుభవించి, ప్రొద్దున నేలేచి నిజమందిరంబున కరిగెను. ఈ విధముగా కొంతకాలము జరిగినపిమ్మట యావృత్తాంతమంతయు తన మామయైన పురందరునకు దెలిసి, యంబుజాక్షి నొకయింటియందుంచి, బీగములు వైచెను. ఆరాత్రి చిత్రకేతు డంబుజాక్షి రానికారణ మేమాయని విచారించుచు, భటునిబంపెను. అతడేగి యాసంగతి గ్రహించి తిరిగి రాజున కెరిగించెను. అంతట చిత్రకేతు డతికోపమనస్కుడై పురందరుని

బట్టిబంధించి, యతనికుమారుని చెరసాలలో బెట్టి యంబుజాక్షిని దోడ్కొనిరమ్మని సేనాధిపతిని బంపగా నాతడట్లు గావించెను. అంబుజాక్షివచ్చి రాజుపాదంబుల కెరగి, తనకుగల్గిన కష్టములు జెప్పుకొని, "నామగని చెరనుండివిడిపించి పురివెడలగొట్టించి, మాగృహంబునందున్న నగలనన్నిటి నిచటికి దెప్పించి, మాయత్త మామలు జూచుచుండగా మాయింటికగ్ని బెట్టించుమని" కోరగా చిత్రకేతు డట్లుజేయించెను. ఆసంగతి నంబుజాక్షివిని సంతోష స్వాంతయై యాతనితో సకలసౌఖ్యము లనుభవించుచు, గౌరీ వ్రతంబాచరించె. గౌరి యామెకు బ్రత్యక్షమై నీకేమి వరము గావలయునో కోరమనగా "తల్లీ ముందు జన్మంబున నాకీ చిత్ర కేతుడే భర్తగా లభించి, సత్యంబుకొరకు ప్రాకులాడి, యెన్ని కష్టంబులు వచ్చినను సత్యంబు వీడక చరించి, చివరకు సత్య లోక నివాసులమగునటుల వరంబొసంగు" మని యంబుజాక్షి గోరెను. గౌరి యావరం బొసంగి యంతర్ధానమయ్యె.

మునులు— మహాత్మా? తదుపరి యెట్లు జరిగెనో సెలవిండు.

అత్రి— కనుక నా పురందరుడే జయసేన మహారాజుగా బుట్టెను. అంబుజాక్షియే చంద్రమతిగా జన్మించెను. చిత్రకేతుడే హరి శ్చంద్రుడుగా నవతరించెను. ఈమె జేసిన మహాదానంబుల మహిమచేత నీ మయబ్రహ్మ చంద్రమతికి ద్వితీయ జనకు డయ్యెను. జయసేనుడీ చంద్రమతి జననర్తు కాలములు చెడ్డ వగుటచేత మందసంబునందుంచి బ్రహ్మపుత్రానదిలో బడవేయిం చెను. పూర్వము భర్తను పురినుండి తరిమించిన కారణమున

నీమెళు పద్మాసనుం డమంగళత్వములిఖించెను. గౌరీవరంబున్ను యీ మునిశ్రేష్ఠుల యాశీర్వాద ఫలంబులున్ను దప్పవు. బ్రహ్మ లిఖిత ప్రకారముగూడ జరుగక మానదు గావున

చ॥ మునికులచంద్రులార, గుణభూషణులార, మహాత్ములార, యీ
వనిత గళంబునందు తన వల్లభుడుంచెడు భద్రసూత్ర మె
వ్వని నయంబులన్ బడక భర్తకు మాత్రమె గోచరంబగున్
దినకరసోములాదిగల దేవగణంబుల ప్రోల బల్కితిన్

హరిశ్చంద్రా? యింక నాలసింపక చంద్రమతి కంఠంబున మాంగల్యము గట్టుము

హరి — చిత్తము (మంగళసూత్రము గట్టుచున్నాడు)

మునులు — (అక్షింతలు వేయుచు)

గీ॥ జయము సత్య ప్రవర్తనా జయముజయము
జయము బుధజన సంసేవ్య జయముజయము
జయము నవమన్మథాకార జయముజయము
అన్ని జయములు నీయందె యమరియుండు

తథాస్తు, తథాస్తు (అందరు నిష్క్రమించుచున్నారు)

(తెరప్రాలును)

---

రంగము — మయుని యాశ్రమము.

(మయబ్రహ్మ, దామోదర, త్రిశంక, హరిశ్చంద్ర, చంద్రమతీ, సత్యకీర్తి, వసిష్ఠ, విశ్రవసు, కన్యపాత్రి, గౌతమాదులుప్రవేశించుచున్నారు)

మయ — బిడ్డా ? చంద్రమతీ, నిత్య సత్యవ్రతుండగు హరిశ్చంద్రుని దప్ప నన్యుల వైవాహికంబాడనని బెట్టిదమైన పట్టుబట్టితివి.

నేటితో నీయభీష్ట మీడేరినది. నీకనుకూలుండగు పతి లభిం
చుట చేత మాకందరకు గూడ సంతోషదాయకమే

చంద్ర— తండ్రీ? మీ దయావిశేషమున నా యభీష్ట మీడేరినదిగాని

ఉ॥ నన్ను నవీ ప్రివాహమున నా తలిదండ్రులు బారవేయగా
క్రిన్నన నాయవస్థగని కన్నుల బాష్పములద్ది తెచ్చియున్
గన్నకుమారికన్న నధికంబగు ప్రేమను బెంచినట్టి మీ
సన్నిధినుండకే చనెదు చానను మీ ఋణమెట్లు దీర్తునో

మయ— అమ్మా నీవట్లు దలంచకుము. విధివిధాన మీ రీతిగా జరుగ
నున్నది. అదిగాక లోకములోని స్త్రీల కందరకు గొన్ని దినం
బులు బుట్టినింటను, మరికొన్ని దినంబు లత్త వారింట నుండుట
సహజమే

త్రిశం— నాయనా హరిశ్చంద్రా? రథం బాయత్త పరచుకొని సుముం
తుండరుదెంచినాడు. ఇకమీరందరు ప్రయాణసన్నద్ధులైరండు

హరి— ఇదుగో వచ్చుచుంటిమి

చంద్ర— నాన్నగారూ, మీ కృపావిశేషమున్నంతవరకు నాకేకొరం
తలు గలుగబోవుగాని, యిక భర్తగారితో నత్తవారింటి కేగు
టకు సెలవిమ్ము

మయ— తల్లీ? నీకు దెలియని విషయమేమున్నది. అయినను కన్న
బిడ్డవలె మిగుల గారాబముతో బెంచినవాడనగుటచే జెప్పు
చుంటిని

సీ॥ జనకుడై దనరారు జయసేను కీర్తిల
క్ష్మికి వన్నె సమకూరఁ జేయుమమ్మ
భర్తను దైవ భావంబున పూజించి
యమితకీర్తి గడించి యలరుమమ్మ

నీ సద్గుణములెల్ల నెలతలు దిలకించి
నేర్చెదు రీతిగా నెగడుమమ్మ
అత్తమామల సేమమరయుచు మదిలోన
వారి సపర్యలు వదలకమ్మ
గీ॥ మునుల పదపూజ లేమారబోకుమమ్మ
ధర్మమే జయమను మాట దలపుమమ్మ
గరళకంఠుని నామంబు మరువకమ్మ
స్త్రీల తలకట్టనంగ వర్తింపుమమ్మ

మరియు

చ॥ సతతము భర్తృ సేవలను సల్పి తదాజ్ఞ లతాను బద్ధులై
యతివినయంబునన్ మెలగి యర్థుల బ్రోచుట చేగదా, యరుం
ధతి, యనసూయ, లాదిగల తల్లులు కీర్తిగడించి, రా పతి
వ్రతలనుగాంచి, నీవటు విరాజిలి పేరువహింప పాడిగా

అమ్మా? పతిసేవయే స్త్రీల కలంకారము. దానిచే నెట్టి బెట్టిదపు కార్యమైన సాధింపబడును. నీ కంతగా జెప్పవలసిన పనిలేదు గాని యింకొక విషయము.

క॥ అనయము పతిసేవ రొయన
ర్చనిసతి కిహపరములందు సౌఖ్యంబులు లే
వను నక్షరములు హృదయం
బను పలకను వ్రాసికొనియు నని మరువకుమా

చంద్ర— తండ్రీ? తమ యాజ్ఞల నన్నిటిని శిరసావహించియే నడచు కొనియెద

మయ— (హరిశ్చంద్రునివంకజూచి) హరిశ్చంద్రా? నాపట్టి నిన్ను దక్క నితరుల వైవాహికం బాడనని బెట్టిదమైన పట్టుపట్టి, యిప్పట్టున నిన్ను గైకొనగల్గినది. ఈమె నింతటినుండి నీ చేతులలో బెట్టితిని. కాన నేజెప్పు విషయములను శ్రద్ధగా వినుము

సీ॥ అన్నపానీయంబు లడుగగా జాలదు
యతిసిగ్గురాలు నా యనుగుపట్టి
అన్యులు తరచిమాట్లాడిన తలవంచు
గండ్రి గాదయ్య నా కన్నబిడ్డ
వడినడచిన చాల బడలిక వహించు
సుకుమారగాత్రి నా సుగుణవల్లి
యొంటరియై యింట నుండగా నోపదు
భీతాత్మురాలు నా ప్రియకుమారి

గీ॥ యిట్టివెల్లను గమనించి యికను ముందు
నీ లతాంగిని యేరీతి నేలగలవో
యట్టి భారంబు నీమెడ జుట్టుకొనియె
భవ్యగుణసాంద్ర, రవికుల వార్ధిచంద్ర

హరి— తాపసేంద్రా? లగ్నకాలంబున మీ మునిశ్రేష్ఠులు గాంచుచుండ, నగ్నిసాక్షిగ నాచే నెట్టి ప్రమాణంబు లాచరించబడినవో, యట్టివాని కన్నిటికిలోనై సంచరించువాడనని తలంచుడు

మయు— (త్రిశంకునివంకజూచి) మహీపాలా?

గీ॥ సుగుణవతియై వెలంగు నీ సుందరాంగి
యంచితంబుగ నీ కోడలయ్యెగాన
నీ తనూజునిపైనుండు నిండుప్రేమ
జూపుమీ యీమెపై నీవు భూపతీంద్ర

త్రిశం— అయ్యా మీరిట్లు జెప్పనవసరములేదు. నాకు చంద్రమతీ హరిశ్చంద్రు లిర్వురు సమానులే. రెంటిని రెండు కండ్లగా జూచుకొనిమెదగాని వేరుగా భావింపను. మహాత్మా నమస్కరించుచున్నాడ. మాకిక సెలవొసంగుము

మయ— రాజేంద్రా? పోయిరండు

హరి— మామగారూ, తమ పాదంబులకిదే వందనము

మయ— ఆయుష్మాన్భవ హరిశ్చంద్రా ? యెట్టి కష్టకాలమందైన సత్యంబువీడక ప్రవర్తించుచుండుము. కడకదియే నిన్నుద్ధరింపగలదు

హరి— చిత్తము

చంద్ర— నాన్నగారూ, భవత్పాదంబులకిదే నమస్కరించుచున్నదానను (కాళ్లపైబడును)

మయ— (లేవదీసి) తల్లీ దీర్ఘసుమంగలీత్వము వహించి, వంశాంకురంబగు సుపుత్రుని గాంచెదవుగాక

వసి— మయమహర్షీ, మేమిక బోయివచ్చెదము

మయ— మహాత్మా దయయుంచుడు. 'చంద్రమతీ పరిణయ'మగుటచే దయచేసితిరిగాని లేకున్న నెల్లపుడు మా యాశ్రమమునకు తను రేలవచ్చెదరు

వసి— మునిసత్తమా, అట్లన బోకుము. అవసరమున్న పక్షమున రాక తప్పునా ?

త్రిశం— చంద్రమతీ, హరిశ్చంద్రులారా? మీరిక నాలసింపక రథమెక్కుడు. గురువరా దయచేయుము

(వసిష్ఠ, త్రిశంక, హరిశ్చంద్ర, చంద్రమతీ, సత్యకీర్త్యాదులు రథమెక్కి పోవుచున్నారు)

చంద్ర—(తనలో) ఆహా యేమి నా భాగ్యము

గీ॥ గరళకంఠుని సత్కృపా గరిమవలన
స్వాంతమునఁగోరి యీ హరిశ్చంద్రునిలను
బెండ్లియాడితిగద కడు పేర్మితోడ
నన్నుఁబోలిన ధన్యాత్ములున్నవారె

(ప్రకాశముగా) మామగారూ, మన పట్టణంబునకిక నెంతదూరము బోవలెను.

త్రిశం— తల్లీ? సమీపించితిమి

వసి— ఆహా? యేమి యీ కన్యామణి ముద్దుపల్కులు. (త్రిశంకుని జూచి) మహీపాలా నీవు కడుధన్యాత్ముడవు. కుమారుని వివాహము గూడ గడపితివి. నీవిక నిశ్చింతతో నెచ్చట నూన్నను నిన్ననువారులేరు.

త్రిశం— చిత్తము. మీ దయావిశేషమున నాకు సుగుణవతియగు కోడలు లభించినది

వసి— హరిశ్చంద్రా? నీకొన్ని వరముల కటాక్షించెద కోరుకొనుము

హరి— తపోధనా! మీ యపార కృపావిశేషమున నాకెట్టి కొరంతలు లేవు గాని

తే॥గీ॥ పండితులకీర్తి జగముల బ్రబలునట్లు
పుడమి దుష్టులు నశియించి పోవునట్లు
శిష్టసంఘంబు లభివృద్ధి జెందునట్లు
వరము లొసగుము కృపతోడ పరమపురుష

వసి— అట్లె యొసగితిని. (చంద్రమతివంకజూచి) అమ్మా! నీవుగూడ కొన్నివరములు గోరికొనుము

చంద్ర— మునిచంద్రోత్తమా!

గీ॥ తరుణులెల్లను భర్తల దైవభావ
మునను పూజించి సద్గతి బొందునట్లు
సత్యమే జయమనుమాట జరుగునట్లు
గా, వరంబులు దయసేయగా గదయ్య

వసి— తల్లీ! అట్లే యొసగితిని. హరిశ్చంద్రా, యింకేమి గావలయును
అయిన నిట్లగుగాక

చ॥ ధరణిగలట్టి మానవులు ధర్మముతప్పక నుండ్రుగాత, స
త్కరుణవహించి యర్థుల సతంబును బ్రోవ దలంత్రుగాత, కా
వరము నశించుగాత, రఘువల్లభుసేవల నెల్లవేళల
స్మరువక జేసి, సద్గతికి మార్గమిదంచు గ్రహింత్రు గావుతన్

తథాస్తు. (అందరు రథముతో నిష్క్రమించుచున్నారు)

(తెరవాలును)

ఇది పంచమాంకము.

గద్యము:—ఇది శ్రీ మల్లవోల్ హనుమద్వరప్రసాదలబ్ధ కవితా వైభవ, సరికొండ వంశోద్భవ, రామరాజ సుపుత్ర, సుజనమిత్ర, ఇరుమెళ్ల రామకోటయామాత్య ప్రియశిష్య, బాలకవి హనుమంత రాజ నామధేయ ప్రణీతంబైన శ్రీ చంద్రమతీ పరిణయము సర్వము సమాప్తము.

---

శ్రీ చంద్రశేఖరార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టి



| తప్పు | ఒప్పు | పంక్తి | పుట |
|---|---|---|---|
| శోదాన | గోదాన | 8 | 1 |
| శలవు | సెలవు | 15 | 2 |
| నన్ను | మమ్ము | 24 | 4 |
| వాహి | పాహి | 16 | 5 |
| వ్రతకాల | వ్రతశాల | 7 | 9 |
| నారవి | నారలి | 10 | 10 |
| వేంద్ర | వేంద్రా | 12 | 13 |
| బిలిపించిన | తండ్రీ నన్ను బిలిపించిన | 22 | 14 |
| యిదియే | ఇదియే | 5 | 15 |
| పతివ్రతమహా | పతివ్రతామహా | 10 | ” |
| చంద్రృవిరీతి | చంద్రునిరీతి | 18 | 16 |
| మహిపాలా | మహీపాలా | 7 | 17 |
| కతన | కతని | 16 | 20 |
| జయ | సుఖ | 4 | 22 |
| ఫతల | ఫల | 20 | 23 |
| భూవాలా | భూపాలా | 22 | 24 |
| మనుటకై | మనుటకైన | 19 | 25 |
| నీవు | నీవే | 11 | 26 |
| రాజేంద్రృ | రాజేంద్రు | 15 | ” |
| రాజాజ్ఞను నిర్వర్తించు | రాజాజ్ఞ నిర్వర్తించు | 2 | 27 |
| చంద్రృలార | చంద్రులార | 8 | 28 |

| తప్పు | ఒప్పు | పంక్తి | పుట |
|---|---|---|---|
| స్త్రలిన్ | స్థలిన్ | 10 | 29 |
| సంధ్వాయు | సంధ్యాను | 15 | 30 |
| లతకన్న | లంతకన్న | 15 | 34 |
| మద | ముద | 18 | 35 |
| హరిశ్చంద్ర్రుడు | హరిశ్చంద్రుడు | 16 | 36 |
| గుచ్ఛు | గుప్పు | 4 | 40 |
| వాతకంబు | పాతకంబు | 9 | ” |
| చుంద్రు | చుంద్రు | 14 | ” |
| యెయ్వాది పేరు | యెయ్యాది | 1 | 41 |
| సివ్వనంబు | నివ్వనంబు | 7 | ” |
| తనూజుడను | తనూజను | 11 | ” |
| పూర్ణేందు | పూర్ణేందు | 19 | ” |
| నారిత్రి | నాచారిత్రి | 20 | ” |
| చంద్రుని | చందురుని | 15 | 42 |
| సంగము | సంగములు | 23 | 43 |
| యదృష్టదశ | యదృష్టదశ | 4 | 45 |
| తడఇచట | తడవిచట | 21 | 47 |
| శీఘ్రమేవ | శీఘ్రమేవ | 4 | 53 |
| భ్రాతి | భ్రాంతి | 21 | ” |
| కొన్నను | కొన్న | 5 | 62 |
| మిచ్చెదను | మిచ్చెను | 18 | 63 |
| సేకొన్ని | సేకొన్ని | 15 | 88 |

# ఈ పుస్తకము నచ్చొత్తించుటకు ద్రవ్యసహాయ మొనర్చిన చందాదారులు

శా॥ శ్రీరాజీవ భవాదిదేవగణ సంసేవ్యుండు, భవ్యాత్ము డ
గ్గౌరీచిత్త సరోజబంభరుడు, నక్షత్రేశధాముండు, లో
కారాధ్యుండు, ముని పరిపాలకుడు, నిత్యానందు, డీశుండు, స
త్కారుణ్యామృత దృష్టితో నెపుడు చందాదార్ల రక్షించుతన్

సత్తెపల్లితాలూకా, ఉప్పలపాడు

1. అల్లంశెట్టి నారయ్య
2. ఆత్మకూరి రామయ్య కొ॥ వెంకయ్య
3. చిలకా రాఘవయ్య
4. కస్తూరి వెంకట్రాయుడు
5. అల్లంశెట్టి చినరత్నయ్య
6. ,, వెంకయ్య
7. వాలిచర్ల వీరభద్రయ్య
8. చింతల వెంకట్రాయుడు
9. మద్దు పద్మనాభయ్య
10. సులగా వెంకయ్య
11. గోరంట్ల చినసర్సయ్య
12. అల్లంశెట్టి పున్నయ్య
13. ఆత్మకూరి జయరామయ్య
14. సుంకర లక్ష్మయ్య
15. పల్రాజు వెంకయ్య
16. సులగా మూర్తెయ్య
17. కట్టమూరి సుబ్బయ్య
18. గాదె హనిమిరెడ్డి
19. చింతపల్లి రూబెన్
20. గోరంట్ల సుబ్బారాయుడు
21. వల్లభనేడి కోటయ్య
22. మేడి చలమయ్య
23. షేఖు ఇమాంసాహెబు
24. పసుమర్తి పాపయ్య
25. చిలకా రామయ్య
26. కస్తూరి కోటయ్య కొ॥ వెంకయ్య
27. అల్లంశెట్టి మద్దిరామయ్యకొ॥పుల్లయ్య
28. షేఖు హుసేన్‌సాహెబు
29. సులగా అచ్చయ్య
30. షేఖు మలికీసాహెబు
31. బూసా రామయ్య
32. గాదె రామకోటిరెడ్డి
33. చిలకా వీరయ్య
34. గాదె కోటిరెడ్డి
35. వేల్పుల పిచ్చిరెడ్డి
36. కొలవాసి వెంకయ్యగారు
37. గాదె చిలవుల్లిరెడ్డి
38. ఇందూరి బాలకోటిరెడ్డి
39. ,, నాగిరెడ్డి
40. సరికొండ జగ్గరాజు

ఇనిమెట్ల

1. కొండ్రకుంట కోటయ్య
2. పొట్లపల్లి కన్నయ్యగారు
3. ,, రామకృష్ణయ్యగారు
4. ,, రంగయ్యగారు
5. రాయసం ఆంజనేయులుగారు

6. కొండ్రకుంట రంగయ్య
7. బండికల్లు బాలకోటయ్య
8. కొత్తమాసు శేషయ్య
9. దామెర నరసింహారావుగారు
10. కొత్తమాసు పెదగురవయ్య
11. షేఖు బడేసాహెబు కొ॥ మస్తాను

## గురజాలతాలూకా, అంబాపురం

1. అమిరిరెడ్డి చిన్నానాసరరెడ్డి
2. దుగ్గిరాల కోటిరెడ్డి
3. „ బుచ్చిరెడ్డి
1. వేములూరి రత్నాచారి (గురజాల)

## మోర్జంపాడు

1. తంగెడ నరసింహయ్యగారు
2. కావా శౌరయ్య
3. చింతపల్లి జగన్నాథరావుగారు
4. గడిపూడి నాగయ్య
5. మేడెగం నాగిరెడ్డి
6. కంకర పెదవెంకటస్వామి
7. మారం చినకోటిరెడ్డి
8. గడిపూడి అనంతరామయ్య
9. „ చిన్న అనంతరామయ్య

## పిల్లుట్ల

1. తంగెళ్ల అప్పలరాజు
2. చక్రవరం రంగరాజు
3. బాహటం పుల్లంరాజు
1. పల్లా ముసలయ్య (గణేశ్వరపాడు)
1. కొల్లూరు వెంకటప్పయ్య (కోనంకి)

## పెదనెమలిపురి

1. గంగవరపు పేరయ్య
2. కోనంకి గోపాలరావుగారు

## గుండ్లపల్లి

1. పమ్మి అప్పిరెడ్డి

నర్సారావుపేటతాలూకా, చీమలమర్రి

1. యర్రంనేని పెదలింగయ్య
2. „ చినలింగయ్య
3. మంచికంటి వేంకటేశ్వర్లుగారు
4. పెమ్మసాని శివయ్య
5. గద్దం కోటయ్య
6. ఆతుకూరి అనంతరామయ్య
7. ముప్పాళ్ల రామదాసుగారు
8. నల్లగట్ల అచ్చయ్య (మునసబ్)
9. గౌరిపట్టం చిన్నసుబ్బారావు
10. సానా లక్ష్మంపతి
11. నల్లగట్ల లింగయ్య కొ॥ కోటయ్య
12. „ వెంకట్రామయ్య
13. కావాగోశయ్య కొ॥ కోటయ్య
14. పెమ్మసాని రామయ్య
15. యర్రంనేని చిన్నవెంకటేశ్వర్లు
16. నల్లగట్ల వెంకయ్య కొ॥ కోటయ్య
1. మద్దిసుబ్బారావు (మాదల)
1. కట్టమూరి వెంకయ్య (ఇరుకుపాలెం)

రెడ్డిగూడెం

1. షేఖ్ హసన్ అహమ్మద్ సాహెబు
2. షేఖ్ హుసేన్ ఆ } గ్రామమునసబు

## భృగుబండ

3. భృగుబండ వెంకట సుబ్బయ్య

## రెంటపాళ్ళ

1. రాచపూడి పానకాలరావు
2. వి. సూర్యనారాయణరావు
3. సుకమంచి వోబులు
4. షేఖు దూదేకుల మస్తాను
5. కనిగిరి చాడప్ప రామయ్య నాగయ్య

6. చాడం వేంకటేశ్వరులు
7. మేడపాటి శోభనాద్రి
8. కోటపాటి లింగయ్య
9. కుప్పాళ్ల రాయుడు
10. పూవాడ భిక్షయ్య యీ మల్లయ్య
11. వల్లంశెట్టి వెంకటస్వామి (తాళ్లూరు)
12. బవిరిశెట్టి సత్యనారాయణ
13. యీ రామయ్య
14. వమ్మిపాటి వెంకట గోపాలరావు
15. ధనీకుల రామానందం
16. మక్కపాటి వెంకట్రామయ్య
17. చన్నమల్లు వెంకయ్య తండ్రి
వెంకటస్వామి
19. మక్కపాటి శన్నయ్య
20. దూదేకుల సైదులు
21. తీర్థాల బూచి కొ॥ వెంకయ్య
నూరిశెట్టి అప్పయ్య యీ వీరయ్య
నర్సయ్య వగైరా
చన్నమల్లు వెంకట్రాయుడు
కొ॥ వెంకయ్య
• ముద్ర కోటయ్య
• మద్దాళి వెంకట కోటేశ్వరరావు

## గోగులపాడు

సుకమంచి పెదవోబయ్య చిన్ననర్సయ్య
ఇందూరి వీరారెడ్డి యీ కోట్రెడ్డి
3. విప్పర్ల మల్లికార్జునాచారి

## మక్కపాడు

1. కటికినేని రంగయ్యగారు
2. „ నరసింహ్మయ్యగారు
3. „ స్వామిగారు
4. పశ్యావుల వోబయ్య నర్సయ్య
5. కణతం చిన్న వుశేను యీ సుబ్బయ్య

6. కటూరు వెంకటప్పయ్య
7. నానబాల పిచ్చయ్య
8. పశ్యావుల చిన రామస్వామి

## బలిజేపల్లి

1 ఇశిరెడ్డి యల్లమందారెడ్డి
2 వోగిరాల చంద్రాయ
3 మామిడి వెంకటసుబ్బయ్య కర్ణం
4 ఉప్పలపాటి సీతా రామా రావు
5 చందలూరి శితమ్మ
6 పతకమూరి రాజయ్య
7 ఇశిరెడ్డి పిచ్చిరెడ్డి

## గణపవరం

1 మద్ది గుర్వయ్య కొ॥ హనుమయ్య
2 వేటుకూరి అప్పయ్య
3 కొప్పు రామకోటయ్య

## చల్లగుండ్ల

1 మేడికొండ మస్తానురెడ్డి
2 అట్లూరి సుందరరామయ్యగారు
3 మారెళ్ల వెంకట్రెడ్డి
4 మంచికంటి వెంకట భద్రారావు
5 కాళంగిహనుమయ్య కొ॥ వెంకటేశ్వర్లు
6 భవనాశి పడిగెలయ్య
7 బొగ్గవరపు కోటయ్య
8 నాదెండ్ల హనుమయ్య
9 రాజోలు రామ కోటేశ్వరరావు
10 షేక్ దస్తగిరీ సాహెబు
11 మస్తాను సాహెబు

## చాగల్లు శివారు కండ్లకుంట

1 చెరుకూరు రాఘవయ్య
2 „ వెంకట్రావు

3 బండ్ల రామకోటయ్య
4 చంద్రా వెంకటకృష్ణయ్య
5 రావెల గోవిందయ్య
6 జంపని నర్సయ్య
7 „ చౌదరయ్య
8 గుంటుపల్లి సుబ్బయ్య
9 కోడెల కోటయ్య
10 చానా వెంకటస్వామి
11 రావెల బుజ్జియ్య కొ॥ రామయ్య
12 అత్తూలూరు కోటయ్య

చాగల్లు

1 అలపర్తి రామకోటయ్య
2 „ పరశురామయ్య
3 „ లక్ష్మికోటయ్య
4 „ వెంకయ్య
5 „ సుంద్రరామయ్య
6 „ వెంకయ్య కొ॥ కోటయ్య
7 కోడెల సంజీవయ్య
8 పెమ్మసాని హనుమంతు
9 „ సుబ్రహ్మణ్యము
10 శావా కోటయ్య
11 పెండేల లక్ష్మికోటి
12 దాసు రామకోటయ్య
13 అంబటి వెంకటనర్సయ్యకొ॥ కోటయ్య
14 గంటా బ్రహ్మయ్య
15 కందులవీరారెడ్డి
స్కూలుటీచరు రెడ్డిపాలెం



